## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020050016091

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ ఆఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

Subject

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

Language

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# మంత్రిత్రయము


విద్వాన్, జోస్యము - జనార్దనశాస్త్రి,
తెలుఁగు పండితుఁడు,
మునిసిపల్ హైస్కూలు, తాడిపత్రి.

నూతలపాటి - పేరరాజు,
తెలుఁగు పండితుఁడు,
బోర్డు హైస్కూలు, ఉరవకొండ.





ఆత్మారాం అండ్ కంపెనీ,
ఎడ్యుకేషనల్ పబ్లిషర్స్,
అనంతపురము.

కాపీరైట్]　　1947　　[వెల: 0-13-0

# విన్నపము

బాలుర భావి - అభ్యుదయమునకుఁ జారిత్రక మహాపురుషుల జీవితచరిత్రములు చక్కని దోహదములు కాఁగలవు. స్వభావకోమలతకుఁ దోడుగా సంస్కారశుద్ధియు, నాదర్శదృష్టియుఁ, గలిగించిన వారి బుద్ధిలతలు మున్ముందు విశేష ఫలప్రదము లగును. జాతీయత - ధర్మనిర్వహణ దీక్ష - సత్యవాచాది సుశీలత - ఉదారాశయము - సర్వమత సహనాది సద్గుణములు చిన్న నాఁటనే యంకురింపఁ జేయుటకు జాతీయ మహాపురుష జీవితావగాహనమున కంటె వేఱు సదుపాయములు కానరావు.

పై యుద్దేశముతో యీ 'మంత్రిత్రయము' వ్రాయుట కాధారములు. విషయమునకు, భాషకు నవినాభావ సంబంధము కలదు. కావున, నారంభము నున్నత పాఠశాలా విద్యార్థుల యోగ్యత కనుకూలముగనే స్వీకరింపఁ బడినవి. గ్రంథాంతమునఁ గొన్ని కఠినపదముల కర్థములు నీఁబడియున్నవి. ఉపవాచకములు విద్యార్థుల స్వయంకృషికి సాహాయ్యముగ నుండవలయుట మొదటి మాగమనింపు. సాధ్యమైనంతవఱకుఁ జరిత్రాంశముల కవిరోధముగనే సంగ్రహించితిమి. గ్రంథవిస్తరభీతిని విషయములఁ జాలవఱకు సంగ్రహింప వలసి వచ్చినది. ముఖ్యాంశముల మాత్రము విడువకుండఁ జూచుకొంటిమి.

మా యుద్దేశ్యము లీషత్తుగనేని బాలురయందు ఫలించిన మా కృషికి సార్థక్యము కలిగిన దని సంతసింతుము.

ఈ మా యుద్యమమునకు విద్యాశాఖాధికారులు, నధ్యాపక మిత్రులు, తప్పక చేయూఁత నొసంగుదు రని మా దృఢనిశ్చయము.

గ్రంథకర్తలు

*
* *

# విషయ సూచిక



* *
*

# చాణక్యుఁడు

ప్రాచీనభారత విజ్ఞానౌన్నత్యమును స్మరించు సందర్భమునఁ బ్రప్రథమ పూజనీయుఁడు చాణక్యుఁడు. నైతిక ఆర్థిక రాజకీయాది లౌకికవిషయములం దాతనిదే యగ్రతాంబూలము. నాఁటికి, నేఁటికి ఖండఖండాంతరుల ప్రశంసకుఁ బాత్రమై, యైహికాముష్మికముల - వైదిక లౌకికముల - శాస్త్రానుభవముల సమ్మేళనము చేసి, సర్వ సర్వంసహా సామ్రాజ్య చక్రమును, దన యపూర్వబుద్ధి చాతుర్యమునఁ ద్రిప్పఁ గలిగినదిట్ట. సర్వంకషమైన సామర్థ్యముతో, సావధానమైన సదసద్వివేకముతోఁ, దత్త్వసందర్శనా దక్షమైన ధర్మదీక్షతో, మాఱు - మఱపు - లేని మన స్థైర్యముతోఁ-ప్రతిఫలాపేక్షారహితమైన పారమార్థికదృష్టితోఁ - బట్టుసడలని పట్టుదలతో - నిర్వ్యక్త ధర్మానుష్ఠానము కావించిన వీరపురుషుఁడు. తన్నుఁ జెనకిన తృణము నేని రూప నామక్రియలు లేకుండఁ జేయునంతవఱకుఁ దృప్తినందని చలపాది. చేపట్టినవాని నింద్రభోగములఁ దేలించినఁగాని, కూటినీళ్లకైన నాశింపని గుణకృపామూర్తి. భావనాబలమునకు నొఱవుజాతివంటి లోకానుభవముతోఁ నాదర్శప్రాయమైన యర్థశాస్త్రమును లోకమున కనుగ్రహించిన ఋషి. వేయేల! భారతీయుల భాగధేయము.

క్రీ. పూ. 321 నుండి 297 వఱకుఁ బాటలీపుత్రము రాజధానిగా మగధ సామ్రాజ్యమును నఖండకీర్తివంతముగ నేలిన చంద్రగుప్త చక్రవర్తికిఁ జాణక్యుఁడే యాయువుపట్టు. ఈ యొక్క వ్యక్తియందే విశ్వామిత్రుని కోపసామర్థ్యములు. భీష్ముని నీతిప్రవీణతయుఁ. కృష్ణుని శత్రుసంహారనాటక కపటసూత్రధారిత్వమును, హనుమంతుని స్వామికార్యధురంధరతయు, మూర్తీభవించి యుండెను. ఇతని ప్రశంస విష్ణు - మత్స్య - వాయు - భాగవతపురాణములయందును, బృహత్కథ - కామందక గ్రంథములందునున్నది. దశకుమారచరిత్రము - పంచతంత్రము - కాదంబరి - చండకౌశికము - హితోపదేశము - విక్రమార్కచరిత్రము లందు సమస్తరాజనీతిశాస్త్రములకుఁ జాణక్యుఁడు గొప్ప ప్రమాణముగ నంగీకరింపఁ బడినాఁడు. శూద్రకరాజ విరచితమైన ముద్రారాక్షసనాటకము చాణక్యుని పరిస్ఫుట బుద్ధిని, ప్రబలమైన యాత్మవిశ్వాసమును, యుక్తితంత్రజ్ఞతను, నిరంకుశ నీతిశాస్త్ర ప్రావీణ్యమును, దూరదర్శిత్వమును, నిర్ణీత ఫలప్రాప్తికిఁ గావలసిన సర్వోద్యమ పరత్వమును జాటుచున్నది.

ఇతనికి - వాత్స్యాయనుఁడు, మల్లనాగుఁడు, కౌటిల్యుఁడు, చాణక్యుఁడు, ద్రామిలుఁడు, పక్షిలస్వామి, విష్ణుగుప్తుఁడు, అంగులుఁడు ననుపేర్లుండినట్లీ క్రింది శ్లోకము తెలుపుచున్నది.

శ్లో॥ వాత్స్యాయనో మల్లనాగ
కౌటిల్య శ్చణకాత్మజః
ద్రామిలః పక్షిలస్వామీ
విష్ణుగుప్తాంగులశ్చసః ॥

ఇం దొక్కొక్కటియు నీతని పాండిత్యసామర్థ్యములను వెల్లడించు బిరుదులుగ నగపడును.

చాణక్యుఁడు 'అర్థశాస్త్రము'ను సంస్కృత సూత్రపంక్తిని రచించినాఁడు. అదే 'కౌటిలీయార్థశాస్త్ర' మను పేరఁ బరఁగుచున్నది. ఇది చాణక్య కృతముకాదను వాదమొకటి యున్నది. కాని, యతనిచేతనే రచింపఁబడినట్లు ప్రబలాధారము లుండుటచేతను, * కామందక కర్త.—

"నీతిశాస్త్రామృతం ధీమా ।
నర్థశాస్త్ర మహోదధేః ।
య ఉద్ధ్రే నమస్తస్మై ।
విష్ణు గుప్తాయ వేధసే ॥"

1. వాత్స్యాయనుఁడు = కామశాస్త్ర రహస్యజ్ఞుఁడు.
2. మల్లనాగుఁడు = యుద్ధసాధనాభ్యాస దక్షుఁడు.
3. కౌటిల్యుఁడు = రాజతంత్ర ప్రయోగ విదుఁడు.
4. చాణక్యుఁడు = నీతిశాస్త్ర కర్తయగు చణకుని కుమారుఁడు.
5. ద్రామిలుఁడు = రణరంగమునందుఁ బ్రముఖుఁడు.
6. విష్ణుగుప్తుఁడు = జ్యోతిశ్శాస్త్ర పారంగతుఁడు.
7. పక్షిలస్వామి = నైయాయికుఁడు - తర్కశాస్త్రనిష్ణాతుఁడు.
8. అంగులుఁడు = గణితశాస్త్ర పారంగతుఁడు.

* 'కౌటిల్యనకృతం' - అని యున్నది.

అని చెప్పియుండుటచేతను, కొక్కఱు సంస్కృత గ్రంథకర్తలు కౌటిల్యకృతమగు నర్థశాస్త్రమున్నట్లు పేర్కొనుటచేతను, నా వాదము నిరాకరింపఁబడినది. ఇట్టి యర్థశాస్త్రముల నితనికిఁ బూర్వమునను, దరువాతను, జాల మంది వ్రాసియుండిరి. ఆ విషయము నతఁడే – "పూర్వాచార్యులచే నెన్నెన్ని యర్థశాస్త్రములు చెప్పఁబడినవో వానినెల్ల సంగ్రహించి, సంక్షేపముగ నీయర్థశాస్త్రము చేయఁబడినది." అని తెలిపియున్నాఁడు. మఱియు నీతఁ డక్కడక్కడ. మానవులు – బార్హస్పత్యులు – ఔశనసులు – పారాశరులు – అంభీయులు – భారద్వాజుఁడు – విశాలాక్షుఁడు – పిశునుఁడు – కౌణపదంతుఁడు–వాతవ్యాధి – బాహుదంతీపుత్త్రుఁడు – లోనగు నర్థశాస్త్రకారులను బేర్కొని, కొన్ని మతముల ఖండించి, కొన్ని మతముల భూషించియున్నాఁడు. అయినను, నీతని యర్థశాస్త్రమువలెనున్నంత ప్రసిద్ధి మిగతవానికిఁ గలుగలేదు. అందులకుఁ గారణ మేమన నీతఁడు పూర్వులవలె బుద్ధిబలముతోను, భావనా ప్రౌఢితోను మాత్రమే కాక, రాజ్యసంపాదన – పరిపాలనములం దగ్రగణ్యుఁడని నడిసిన్న చంద్రగుప్త చక్రవర్తికిఁ గుడిభుజమై, రాజ్యనీతిని స్వయముగను, జయప్రదముగను బ్రయోగించిన లౌకిక వ్యవహారానుభవముతో గ్రంథమును వ్రాయుటయే. ఇట్టి యనుభవజ్ఞులే దండనీతి నుపదేశింపఁ దగినవారని యీతని సిద్ధాంతము. తన గ్రంథ

మున రాజపుత్త్రుల విద్యాభ్యాస పద్ధతిని నిర్ణయించుచు, "అధ్యక్షులనుండి వార్తను, వక్త్రప్రయోక్తలనుండి దండ నీతిని నేర్చుకొనవలె" నని చెప్పియున్నాఁడు.

ఈ యర్థశాస్త్ర రచనను బట్టి యితనిబుద్ధి ధారాళ మైనదనియు, విషయవివేచనమునందు స్పష్టతను గోరునట్టిది యనియు, 'అతి సర్వత్ర వర్జయేత్' అను వాక్యానుసార ము వర్తించువాఁడనియు, యుక్తులను సాధించుటయందు వ్యవహారానుకూల్యమే ప్రధానాంశముగ నెంచినవాఁ డనియు, గౌప్యమును వహించువాఁడు కాఁడనియు, వైదిక మతమునందు దత్యంతాభిమానము కలవాఁడనియు, స్ఫురిం చును. 'ఉద్వేజనీయమగు తీక్ష్ణదండము కాని, పరిభవ కారి యగు మృదుదండముకాని, కూడదు; యథార్హా దండమే దండము. ధర్మార్థముల కవిరోధముగఁ గామ మును సేవింపవలెనుగాని, సుఖరహితుఁడు కాఁగూడదు.' అను నిట్టివాక్యములు చాణక్యుని సమదృష్టి కుదాహరణము లై యున్నవి. పిడివాదము చేసి, యేదియో యొక విధముగఁ దమమతమును గెలిపించుకొనవలె ననెడి శాస్త్రకారులలోఁ గౌటిల్యుఁ డొకఁడు కాఁడు. కార్యసాఫల్యమే యాతని ముఖ్యోద్దేశము.

కౌటిల్యుఁడు తక్షశిలానగరమున జన్మించినవాఁడని కొందఱును, ద్రవిడదేశమువాఁడని యింకఁ గొందఱు

నూహించియున్నారు. ఇతని పూర్వులు ఋషితుల్యులగు బ్రాహ్మణులు. ఇతఁడు చిన్నతనముననే యుపనీతుఁడై సాంగోపాంగములైన చతుర్వేదముల నేకధాటిగ నధ్యయనముచేసినవాఁడు. సకల కళలయందలి రహస్యముల సంగ్రహించెను. బ్రహ్మతేజ స్సతని ముఖమునందు మూర్తీభవించి యుండెను.

ఇతని కాలమునందు నవనందులను రాజులు మగధ రాజ్యమును పాటలీపుత్రమును రాజధానిగఁ బాలించుచుండిరి. వీరు వైదికేతరములగు జైనబౌద్ధమతములలో నొకదాని నవలంబించినట్లు తోఁచుచున్నది. వీరు ప్రజలను బీడించి, ధన సంగ్రహము కావించుచున్నట్లు నూహించు నవకాశములును లేకపోలేదు. భోగలాలసులు-నీతిబాహ్యులు-ధర్మదూరులునగు వారి రాచఱికము శిష్టబ్రాహ్మణుఁడగు చాణక్యునకు సరిపడదయ్యెను. అధీతి - బోధ - ఆచరణ - ప్రచారణలను నాలుగంగములు సమకూరిననేకాని సాంగములయిన విద్యలకు సార్థక్యములేదని గ్రహించినవాఁడు కావున, లోకకల్యాణము చేకూర్చుటకుఁగా, నందుల నిర్మూలించి, ధర్మసామ్రాజ్యము స్థాపించు నుద్దేశము స్నాతకోపదేశితుఁడై గురుకులమునుండి వెడలివచ్చునపుడే చాణక్యుని యంతరంగమునం దంకురించెను. దానిని నిర్వహించుకొనుటకు నుపాయాన్వేషణము కావింపుచుఁ బాటలీపుత్ర

ప్రాంతమునఁ బర్ణశాల నిర్మించుకొని, పరిసరములఁ బరి కించుచుండెను.

పాటలీపుత్రము గంగానదీతీరమునఁ గలదు. అది మగధసామ్రాజ్యమునకు రాజధాని. దానిని దొలుతఁ జంద్ర వంశజుఁడైన సర్వార్థసిద్ధి పాలించుచుండెను. అతనికి సునంద యను పట్టమహిషియందుఁ దొమ్మండ్రు పుత్త్రు లుదయిం చిరి. వారికే నవనందులందురు. విజాతీయ యోషిద్వతంసి మగు మురయం దొక్క తనయుఁడు గలిగెను. అతనికి మౌర్యుఁడని పేరిడిరి. మౌర్యునకు బహు భార్యలయందు నూర్గురు సుతు లుద్భవించిరి. వారిలోఁ జంద్రగుప్తుఁ డొక్కరుఁడు.

వృద్ధరాజగు సర్వార్థసిద్ధి నవనందులలోఁ బెద్దవానిని సింహాసనమున నిలిపి, తక్కినవారిని నాతనికి సాయముచేయ నియమించి, తాను భార్యలతోడను, మంత్రియగు రాక్ష సునితోడను బ్రయాగక్షేత్రమునకుఁ బోయి తపమొనర్పఁ దలఁచెను.

మౌర్యుఁడును, నాతని కొడుకులును జిన్ననాఁటనుండి తమపైఁ బ్రేమగలిగియున్నను, వారి సత్త్వసమృద్ధికి, సుగుణసంపత్తికి నోర్వలేక, నవనందులు వారిని దుదముట్టింప వేచియుండిరి.

మహారాజును, మహామంత్రియు నూరలేసి యయ్యు జనన సమానించకుఁడున ట్లొక కుట్రపన్ని, నందులు

మౌర్యుని. నాతని తనయులను నేలమాళిగలోనికి రప్పించి, బంధించి, కూడునీళ్లు పోయక వారిని జంపించిరి. చంద్రగుప్త మౌర్యుఁ డొక్కరుఁడుమాత్రము మృత్యువాతనుండి తప్పించికొని, తమవారి యాదేశానుసారము తన జీవితము నందేనాఁటికైన శత్రువుల నిర్మూలించి, మృతులైన జనక సోదరుల యాత్మలతృప్తిఁగావించు దీక్షఁగొని, ప్రాణముల బిగఁబట్టి యుండెను. దైవవశమునను, నాయుశ్శేషబలమునను, నెట్లో యాతఁడా రౌరవమునుండి వెలివడి, చిరకాలము కారాగారమున నుంచఁబడెను. పదపడి, పంజాబు పరీక్షకుఁడుగాఁ బంపఁబడిన కృతకసింహపంజర వ్యాజమున బందీవిముక్తుఁడై తన పరువునకుఁ గొఱఁతయగు నన్నసత్రాధికార పదవి నియుక్తుఁడై, నందనిర్మూలనమున కుపాయాన్వేషణము గావించుచుండెను.

ఒకదినమునఁ బురబహిఃప్రదేశమునఁ జంద్రగుప్తుఁడు చింతాక్రాంతుఁడై యొకచోఁ గూలఁబడియుండెను. అప్పుడా మార్గముననే మన చాణక్యుఁడెటకో పోవుచుండెను. అతని కాలికి గఱికతీఁగ యొక్కటి తగులుకొని గమనవేగమును నిరోధించెను. అప్పు డతని మాస్యమునఁ దీఁగదగులుకొన్న వేదనకంటెఁ దృణమువలని పరాభవమే యెక్కుడుగఁ దోఁచెను. అంత నాతఁడు నిలిచి, చేతి దండముతోఁ ద్రవ్వి, యాతీఁగను సమూలముగఁ బెల్లగించివైచెను. కాని, యంతతో నాతని పరాభవాగ్ని చల్లారలేదు. చెంతనున్న

యగ్నితో దానిని భస్మముచేసి, కమండలూదకమునఁ గలుపుకొని, త్రాగి, త్రేచెను. మరలఁ దనదారి సాగనిచ్చెను. ఆచెంగటనున్న చంద్రగుప్తుఁడీ యద్భుతచర్యను నిశితముగ నిరీక్షించుచుండెను. అతని యాకారగాంభీర్యము- ఉట్టిపడు క్షాత్త్రమిశ్రిత బ్రహ్మతేజము - ముఖవికాసము చెప్పక చెప్పుచున్న పాండిత్యప్రకర్ష - కార్యదీక్ష - చలపాదితనము మొదలగు గుణములు చంద్రగుప్తు నాకర్షించెను. ఈ మహనీయుని వలననే తనకుఁ గార్యసిద్ధి కలుగఁ గల దన్నదృఢనిశ్చయ మాతనికిఁ గలిగెను. క్షత్త్రియ కులాటవీదవదహనుఁడు - భార్గవరాముఁడు స్మృతికివచ్చెను ఆంగిక శుభశకునములు వలనిఁ బ్రేరేప, వడివడి నాపుడమి వేలుపుకడకుఁ జని యడుగులఁ బడెను. ఎఱుఁగుచున్న యాతని నెఱింగి, 'సంకల్పసిద్ధిరస్తు' అని యాతఁ డాశీర్వదించెను. ఎంతకును బాదములవదలని చంద్రగుప్తుని, "వత్సా! లెమ్ము. నాతో నేదేని కావలసినపని యున్నదా? ఉన్నచోఁ గొంచక నా కెఱింగింపుము. యథాశక్తి సాయపడెదను." అనుచు రెండు బుజములుపట్టి లేవనెత్తెను. అతని యానతవదనము నశ్రుపూర్ణ నేత్రద్వయము - దీనావస్థ - నవ్యనవనీత సమానమైన చాణక్యుని నిండుమనమ్మును ద్రవీభూతముఁ జేసి, "ఏల? నాయనా! నీ కింతవగపు?" అని ప్రశ్నించెను. ఆ ప్రశ్నకు నాతఁడు తన శోకవేగము నించుకంత యాఁపుకొని, యిట్లనియె: "స్వామీ! నందుల కప

టమునకుఁ గోనై ప్రత్యక్ష రౌరవంబనఁదగు నేలమూలలో నా జనకునితోడను, సోదరులతోడను జావక మిగిలిన యభాగ్యుఁడను. చచ్చి, వారు స్వర్గమున నున్నారు; చావక, బ్రదుకక, నీచపుఁ గొలువునఁ దగులుకొని, నేనిచట నూగులాడుచున్నాను. బ్రదికి వారి యాత్మలకు శాంతి చేయఁ గలిగితినా? నన్నీశోక పారావారమునుండి సముద్ధరించువారిఁ గానక వెదకుచుండఁగా, నా పాలిదైవమువలె నీ నాఁటికి మీరగపడితిరి. ఇఁక నా కన్యథా శరణము లేదు. నా రక్షణభారము మీది.”

ఇట్లాత్మార్పణము చేసికొన్న చంద్రగుప్తుని బరికించి చాణక్యుఁ డాత్మలో, “రాయుతీఁగ కాళ్ల బెనఁగినట్లయ్యె. నా మనోభీష్ట నిర్వాహణమున కితఁ డాధారభూతుఁడు కాఁగలఁడు. ఈతఁడు, సర్వార్థసిద్ధి మనుమఁడు. సకల రాజలక్షణ లక్షితుఁడు. వినయ వివేకములు గలవాఁడు. చేకొనఁదగినవాఁడు.” అని నిశ్చయించుకొని, “వత్సా! నీసౌజన్య సౌమనస్య సౌరభ్యములకు నా మనోభృంగము వశమయినది. నీ విఁక శోకంబు విడుము. ఎట్టి విషమఘట్టమునందు నుత్తమక్షత్రియుఁడు నిర్వేదము నందరాదు. నీయింగిత మెఱింగితి. ఇంతకుముందే నవనందుల నాశమునకు దీక్షఁ బూనియుంటిని. అది నీకును హితమేకదా! నేఁడు నారెండవ దీక్ష వినుము. నిన్ని దేనవనందుల సింహాసన మెక్కించి, నిష్కంటకముగ నీచే రాజ్యమేలింతును.

నా మాట దబ్బఱయని సంశయింపవలదు. నానీతి ప్రయోగ మున కీ మందులు - నందు లెంత ! కాని, వారిపై బడు గార ణము కావలయును గదా! వారు న న్నెప్పుడు చెనకుదు రానాడే - వారి నాశమునకు నాందీప్రస్తావ మనుకొనుము. అందులకు నీవు నుపాయమాలోచింపుచుండుము. ఇప్పటికే యాలస్యమయినది. మాధ్యాహ్నికానుష్ఠాన మాచరింప నేగవలయును." అని పలికెను. అంతట జంద్రగుప్తుడు, "స్వామీ! ఈ పూటకు నా పెత్తనమునం జరుపఁబడు చున్న సత్రమునకు విచ్చేసి, నాయభీష్టముఁ గృతార్థము సేయుము." అని ప్రార్థింప, నందుల కతఁడును, "ఔను. నేనును జాలదినములనుండి, యన్నసత్రమునుజూడ నిచ్ఛ గించితిని. నేడు ప్రొద్దునుబోయె. పోదముపద" మని యాతనితో నడచెను.

కుతపకాలమైనది. అన్నసత్ర మాఁకొన్న యతిథుల చేత నిండినది. భోజనశాలయందు విశాలకదళీపర్ణములు పఱవఁబడినవి. పీటలు వేయఁబడియుండెను. పరదేశివిప్రులు వచ్చి యాసనముల నలంకరించుచుండిరి. అన్ని స్థలములు నిండిపోయెను. అగ్రపీఠము మాత్ర మట్లే యుండినది. అది వేదాధ్యయన సంపన్నుఁడు - నిష్ఠాగరిష్ఠుఁడు - కర్మ శ్రేష్ఠుఁడు - తేజశ్శాలి - ఆనాటి విప్రసంఘమున కధ్యక్షుఁ డుగానుండఁ దగినవాని కని నిశ్చయింపఁబడినది. దాని నధి ష్ఠింప నెవ్వరికి నాత్మ ప్రత్యయమే చాలలేదు. వడ్డిన

లారంభ మగువేళకు మన చాణక్యుఁడు మాధ్యాహ్నిక క్రియాకలాపము ముగించుకొని, భోజనశాల ప్రవేశించెను స్థానము లన్నియు నిండియుండెను. మిగిలియున్న యగ్ర స్థానము నేయనుమానము లేక యధిష్ఠించెను. ఆ సమయమునకు మృత్యువుచేఁ దలఁబట్టి యీడ్వఁబడిన వారివలె యాదృచ్ఛికముగ నచ్చటికి నవనందులు వచ్చిరి. వెన్నంటిన యమదూతి యన్నట్లు బ్రాహ్మణద్రుహుఁ డొకఁడు వారితోడ నుండెను. ఆతఁడు వారికి సర్వవ్యసన సహకారి మిత్రుఁడు. వాని కాయగ్రస్థాన మొప్పింపవలయునను నుద్దేశముతో నందులు చాణక్యుని తెన్నుగనిరి. అంతలో నతఁడు తన నిశ్చితస్థానము వదలక, 'నాకంటె నాతఁడు దేనిలో నుత్తముఁడో మొదట నిరూపించుఁ' డనెను. మొదటే వారిది క్షత్త్రియవంశము - పసివయసు - అసమానమైన సిరిసంపద - అన్నిటిని మించినమూర్ఖత - పైఁగా, మృత్యువాఘ్రాణించుచున్నది. అందువలన నందులు చాణక్యుని వచనము సరకుగొనక, "బడుగుబాఁపని కింత బీరపుఁబలుకులా! మీఁదు మిక్కిలి మేమువరమైనది కన్నుగానక రాజాజ్ఞోల్లంఘనముచేసె. మఱొకఁడైనచో మరణము నొందియుండును. పాఱుఁడైనాఁడు. పిచ్చుకమీఁద బ్రహ్మాస్త్రము తగదు." అని తిరస్కారముగఁ బలుకుటే కాక, వారిలోఁ జిన్నవాఁ డాతని చేతిఁబట్టి పీఠమునుండి లాగెను. అప్పుడు విడివడిన కేశపాశములోఁ, బ్రజ్వరింపఁ జేయఁబడిన క్రోధా

గ్ని చ్ఛటచ్ఛటలంబోలు వికట భ్రుకుటీ దీర్ఘనిశ్శ్వాస రదన పీడనముతోఁ, బ్రళయకాల రుద్రునిమరపించు నా చాణక్యుని నోటినుండి, "ఛీ! గర్వాంధులారా! నందులారా! నా యంతరం బెఱుంగక నాతోఁ జెనకి నాశమునకుఁ ద్రోవ చేసికొంటిరి. నా తపోగ్ని కిప్పుడే మిమ్ము శలభములఁ జేయఁజాలుదు. అయినను మీ యంతటి నీచులకై పావన తపోవ్యయమునకిఁ బాలుపడను. ఇదే నాశపథము విని, చేతనైనచో మిమ్ము మీరు కాచుకొనఁ బ్రయత్నింపుఁడు. మీ తోకస్మంద్రను సింహాసనమునుండి లాగి, పేరు లేకుండఁ జేసి కాని, నా యూడిన యీ శిరోజముల ముడువను." అను పలుకులు తమంతఁ దామె వెడలెను. అంత నాతఁ డటనుండి చరచర వెడలెను. నందులు మాత్రి, "ఈతఁ డెవఁడో వెఱ్ఱివాఁడు. వీని పలుకుల కేమి" యనుకొని, సత్రము వీడిచనిరి.

చాణక్యుఁడు నందనాశనమునకును, చంద్రగుప్తుని సింహాసన మెక్కించుటకును చేసినశపథములను దీర్చుకొనుట కిప్పు డవకాశము దొరకినది. కాని, చాణక్యుని కంములకుఁ దగినసాధనసంపద లేదు. సైన్యమా? ధనమా? తనకు లభించిన చంద్రగుప్తుఁడును మిక్కిలి యభాగ్యుఁడు. "వ్రేలున్నది - త్రోలున్నది. ఇఁక వడలుటెన్నట్లో" అను రీతిగ నున్నది చాణక్యుని స్థితి. అంతయు నుత్తచేతితో

మూఁరవేయుటే. ఏమియు లేనిచోట – అప్పుడు టెంకనాటి, మొలిపించి, మొక్కఁజేసి, కాయించి, పండించి, తినిపింపఁ గలిగినంతటి గారడివిద్య నేర్చినవాఁడు చాణక్యుఁడు. కాని, తన గుట్టును గనిపెట్టి, యెత్తునకుఁ బైయెత్తు వేయఁగల మహామేధాశాలి – మహామంత్రి రాక్షసుఁడు నందులకండయై యున్నాఁడు. అట్టిచోఁ జాణక్యుఁడు దనకార్యము నెంత సామర్థ్యముతో నిర్వహింపవలసియుండునో యూహింపుఁడు. తన తంత్రము తనకుఁ దప్పనంతటి మేధాశాలికిని దుర్గ్రాహ్యమే. ఆనాఁడే యతఁడు చంద్రగుప్తుని దోడ్కొని నైమిశారణ్యమున గంగానదీతీరమునందున్న సోమేశ్వరాలయము చేరువనుండు తన మిత్రుఁడైన ఇందుశర్మ గృహమునకుఁ బయనమై పోయెను.

ఆ బాల్యస్నేహితుఁడును, సహాధ్యాయియునగు నిందుశర్మ చాణక్యుని రాక కెంతయు సంతసించి, యాతనిని, జంద్రగుప్తునిఁ బ్రీతిపూర్వకముగ సత్కరించెను. అందునకుఁ జాణక్యుఁడు ప్రహర్షితాంతరంగుఁడై, చంద్రగుప్తుని దీనచరిత్రమును, నందుల యత్యాచారములను, దన శపథములను దెలిపి, యాతని సహాయమభ్యర్థించెను. ఇందుశర్మ యందుల కంగీకరించెను. అంతఁ, జాణక్యుఁ డాతనికి నేర్పవలసిన విద్యలు నేర్పి, బౌద్ధసన్న్యాసివేషము వేయించి, జీవసిద్ధి’ అని పేరిడి, ‘నీవు నీ శిష్యులతో మగధరాజధానిని

ప్రవేశించి, యందు రాక్షసామాత్యునకు నమ్మికపుట్ట మెలఁగుచు, భూమీ జ్యోతిషాది విద్యలచేత వారిని మెప్పించి, యందే కొలువుననిలిచి, యందలి రాజతంత్ర రహస్యముల నెప్పటి కప్పుడు శిష్యుల కెఱింగించి పుచ్చుచు, నాకు సహాయకారివై యుండు' మని యాదేశించి యనిపెను. జీవసిద్ధియు మిత్ర కార్యనిర్వహణార్థమై, ఛాత్రబృందమును వెంటఁగొని, పాటలీపుత్రమునుగూర్చి పోయెను. అంతఁ జాణక్యుఁడును జంద్రగుప్తునితోఁ బయనమై, నందరాజ్యాక్రమణ కుతూహలియైన పర్వతరాజు కడకు నడచెను.

అప్పటికిఁ బర్వతుఁడును దనవేగువారివలనఁ జాణక్య పరాభవము విని, నందుల నాశనమాసన్నమైనదనియెంచి, తద్రాజ్యాక్రమణము పన్నుగడలలో నుండెను. ఆ సమయమునఁ దనమీఁదికి లంపాక దేశాధిపతియగు గిరివర్మ యెత్తి వచ్చెననివిని, నాతనితోడి యాయోధనమునకు నఖలసైన్యమూయత్తపఱచుకొని యుండెను. అత్తఱిఁ, జాణక్యచంద్రగుప్తులచటి కరుదెంచిరి. వీరి సాహాయ్యమునఁ బాటలీపుత్రమును బట్టుకొనవచ్చునను నాశ యప్పుడు పర్వతున కుదయించెను. అది యెఱిఁగి వారును, 'మీరు మాకు సాయపడుదురేని, సగము రాజ్యము మీకిత్తు' మని వాగ్దానముచేసిరి. దానికిఁ బర్వతుఁ డెంతయు హృష్టుఁడై, వారికి సహాయపడ నిచ్చగించెను. అంత నాతఁ డొక్కక్షణము

యోజించి, "రేపో మాపో పైఁబడనున్న లంపాకవాహినిని వారించికదా నేను వీరివెంటఁ బోవలయును! అది యెట్లు సాధ్యమగు"నని విచారించుచుండఁ, జాణక్యుఁ డాతని మనోరథము గుర్తించి, 'దీని కింతవగవనేల? నాతంత్రసైన్యమును జూడుము. నీవును, నీ సైన్యమును గాలుగదల్పకయే యీవాహినిని కాలఁగోలెద' ననెను. ఆ మాటలకుఁ బర్వతుఁడు సంతసించి, యట్లు చేయ వేఁడెను. వెంటనే, చాణక్యుఁడు రెం డుత్తరములు వ్రాసి, రాజముద్రలు వేయించి, యొకనియోగిని బిలిపించి, యాతనికిఁ జెప్పవలసిన పలుకులు సెప్పి, లేఖలొసఁగి, యాతనిని గామరూప దేశాధీశుఁడైన సూర్యవర్మ కడకుఁ బో నాజ్ఞాపించెను.

అంత నానియోగి - కమలాపీడుఁడు రాజోచితకల్నములను గైకొని, భటునివెంటఁ గామరూపదేశమునకుఁ బయనమయిపోయి, దాని ప్రధాన నగరమైన ప్రాగ్జ్యోతిష పుర బహిరుద్యానముఁ జేరి, యందు విడిసెను.

మఱునాఁడు, కమలాపీడుఁడు తాఁ దెచ్చిన యుత్తరములలో నొక్కదానిని దనభటునకొసఁగి, కొన్ని మాటలు చెవివేసి యంపెను. ఆభటుఁ డా యుత్తరముఁ గైకొని, ప్రాగ్జ్యోతిషముఁ బ్రవేశించి, తాఁ జూచినవారినెల్ల, 'అయ్యలారా! పర్వతరాజుకడనుండి వచ్చిన రాయబారి యిం దెందున్నవాఁడు? ఆతనికి మా రాజునుండి తెచ్చిన యుత్తర

మొసఁగవలయు' నని యడుగుచుండెను. వాని నందలి రాజభటు లనుమానించి, రాజ సన్నిధికిఁ బట్టుకొనిపోయిరి. రాజు నాతని నందే యుంచి, యాతఁడు చెప్పిన రాయబారిని వెదకి తెప్పించెను. ఆనియోగియు నుచిత వస్తులతో నా స్థానిఁ జేరి, ప్రభువునకై దుపదులాచరించి, తాఁ దెచ్చిన కానుకలనర్పించి, యొక లేఖనందించెను. దానిని విప్పి చదువ, నందు, బర్వతేశుఁడు తన పుత్త్రుఁడైన మలయ కేతువునకుఁ, బ్రాగ్జ్యోతిషపురాధి నాథుఁడైన సూర్యవర్మ జ్యేష్ఠపుత్త్రికనిచ్చి వివాహముసేయఁ బ్రార్థించినట్లుండెను. అందునకు రాజు సంతసించెను. ఇఁక, దూత తెచ్చిన రెండవ యుత్తరమును తీసిచూడఁగా, నందుఁ బర్వతుఁడే తన నియోగియగు కమలాపీడునకు, 'నీకు రాజదర్శన మబ్బినదో లేదో తెలియదు. నిన్నుఁ బంపిన పిదప, నేనొక్క విష యము వింటిని. ఈలోపల లంపాకదేశాధీశుని యాస్థాన మున, నా రాజునకును, నతని మంత్రులకును జరిగిన చర్చ లోఁ గామరూపదేశాధిపతి వంశమందు సాంకర్యదోషము కలదని వ్యక్తమైనది. కాని, నేనాపలుకులు విశ్వసింపను. అతనితో సంబంధముఁ జేయ నెంతయు నిచ్ఛగించియున్నాను. సూర్యవర్మ భూదేవి పౌత్త్రుఁడైన భగదత్తుని వంశమున జనించినవాఁడు. కావున, నట్టివంశమునకుఁ గళంక ముండ నేరదని నేను నమ్ముటయేఁ గాక, పెద్దలవలనను విన్నవాఁ డను. లంపాకపతి మదమాత్సర్యముల వలనఁ గన్నుగానక,

కామరూపాధీశు నిట్లు నిందించియుండను. ఇందలి సత్యా సత్యములను బరోక్షమున విచారించి, కార్యనిశ్చయము చేయుము' అని లిఖింపఁబడి యుండెను. ఆ మాటలకు సూర్యవర్మ దండతాడిత భుజంగంబువోలె మండిపడి, కోపము నడఁచుకొనఁ జాలక, వెంటనే, యాతఁడు లంపాక దేశాధీశునిపైకి దండెత్తిపోయెను.

ఈ సమాచారమును బర్వతుఁడు నియోగివలన విని, చాణక్యుని తంత్రమున కబ్బురపడి, యాతని ననేకవిధములఁ బ్రశంసించెను. చాణక్యుఁ డప్పుడు, 'నా కిది యెంతపని? ఒక్క నందరాజ్యమునే కాదు, ప్రపంచ సామ్రాజ్యము నేని నా నీతి తంత్రముచేత నిర్జింపఁగలను. కాని, నా యుద్దేశము రాజ్యసంపాదనము కాదు; నంద నాశనమే. నే నెట్టి తంత్రము పన్నినను నా యనుచు లది గ్రహింపఁజాల' రని యనువఁ, బార్వతీశుఁ డాతని తంత్ర నైపుణికి లోలోన సంతసించి, బదులాడక, ససైన్యుఁడై, చాణక్య చంద్రగుప్తులతోఁ, బాటలీపుత్రమువైపు పయనము సాగించెను.

ఆలో రాక్షసుఁడు, పర్వతునికి, నాతని సామంతుల కును భేదము పుట్టింప ననువగు లేఖలువ్రాసి, పర్వతేశుని దేశముననున్న తన గూఢచారుల కంపెను. జీవసిద్ధి యంపిన చారులవలనఁ జాణక్యు నా రహస్యముఁ దెలిసికొని, రాక్షసభటులను బట్టి బంధించెను.

అనిమీఁదఁ జాణక్యుఁడు మఱియొక తంత్రము పన్నెను. కాశీరాజు నందుల కంతరంగ మిత్రుఁడని యాతనికి బాగుగాఁ దెలియును. కావునఁ, గాశీరాజునకుఁ బర్వతుఁడే తనకు యుద్ధమున సహాయముగా రమ్మని కోరినట్లొక కమ్మ చాణక్యుఁడు వ్రాసి, దానిని జారులకిచ్చి, యాతనికడకుఁ బంపెను. కాశీశుఁ డాయుత్తరముఁ జదివికొని, తన మిత్రులైన నందులకడకేఁగి, వారితో మంతనములు జరిపెను. అంత వారెల్లరొక తంత్రము పన్నుకొనిరి. కాశీశుఁడు ససైన్యముగఁ బర్వతరాజునకు సాయపడఁబోవునట్లు పోవలసినది. అప్పు డాతనికిఁ బ్రత్యుత్థానము సేయఁ బర్వతుఁడుగాని, యాతని తనయుఁడైన మలయకేతువుగాని, యాతనికి మిత్రమైన చంద్రగుప్తుడుగాని వచ్చును. ఒకవేళ చంద్రగుప్తుఁడే వచ్చుచో నాతనిని మోసగింపక తుదముట్టించునది; లేక, పర్వత మలయకేతువులలో నేవాఁడు వచ్చినను బంధించునది. పర్వతుని సేన కొంత సమసినమీఁదనే యీ క్రియాకలాప మంతయు జరుగవలయునని నిశ్చయించుకొనిరి. ఇదియే — వారు పన్నుకొనిన తంత్రము. అంతఁ గాశీరాజు పర్వతు నాహ్వాన మంగీకరించినట్లొక లేఖ వ్రాసి, యా భటుల కిచ్చి పంపెను. వీరిట్లు సేయఁగలరని నీటిలో జాడలుదీయు చాణక్యుఁ డెఱుఁగకుండునా ?

చంద్రగుప్తునకు బాసటయై నిల్చిన చాణక్యుఁడు తన మిత్రుఁడైన జీవసిద్ధికి నందుల యభ్యుదయార్థమని శత్రుపలా

యన జపశాల నిర్మింప బోధించెను. అతఁడందులకు వల్లె యని, తన మనోభీష్టమును సిద్ధార్థకున కెఱింగింప, నాతఁడు జీవసిద్ధి యాజ్ఞను దలఁదాల్చి, సరయూనదీ తీరమున జపశాలను వేయించి, శత్రుపలాయన జపము కొనసాగింప మాసోపవాసిని నియమించెను. చాణక్యుని ప్రేరణమున, జీవసిద్ధి యాజ్ఞానువర్తియై మాసోపవాసి నందులను గాంచి, 'శత్రుపలాయన జపము ముగియుచున్నది. నేఁటికి మూఁడవదినము నాల్గవజామునఁ బూర్ణాహుతి జరుగును. ఆ వేళకు మీరందఱచటికి విచ్చేసి, ప్రసాదమును స్వీకరించునది. దీన మేలగు' నని నుడివెను. అందులకుఁ గొమాండ్రు నందులును నంగీకరించిరి.

అంతలోఁ జాణక్యుఁడు తృప్తినొందక, చంద్రగుప్త హితకాంక్షులైన భాగురాయణాదులకుఁ బార్వతీయులపై కేగి, తామును తమ సైన్యమును మేషయుద్ధము చేయునట్లు జీవసిద్ధివలన నుపదేశ మిప్పించెను.

యుద్ధము ప్రారంభమయ్యెను. కిరాత-హూణ-శక సైన్యములు పర్వతునివైపువచ్చి పాటలీపుత్రమును ముట్టడించెను. ఉభయపక్షములకుఁ బోరు ఘోరముగ జరిగెను. రాక్షసుఁడు స్వయముగఁ గత్తిపట్టి కదనరంగమున నురికెను. ప్రళయకాలరుద్రుని బురుడించు నాతని పరాక్రమమున కాగలేక, శత్రుసైన్యములు వెనుచూపి పాఱఁ జొచ్చెను.

పాఱుఁబోతులఁ బట్టి వధించుట వీరధర్మము కాదని విజయ దంతావళముపై రాజసుఁడు పురాభిముఖుఁ డయ్యెను. కోట దరియువఱకుఁ బర్వత సైన్యములోఁ గొంతభాగము కోటను గప్పుచుండెను. అచట భోజసైన్యము సహాయముతోఁ రాజసుఁ డా వాహినిని వెనుకకు మరలించెను. నాఁటి యతని విక్రమమును వందులు కొనియాడిరి.

మరల, రెండవనాఁడు, పర్వతనందులు సమసిన సైన్యముల సరిదిద్దుకొని, సంగ్రామమున కుపక్రమించిరి. ఆనాఁటి ప్రవిదారణము తొలినాఁటికంటె దారుణమయ్యెను. యుద్ధభూమి పీనుఁగుల పెంటలతో, రక్త ప్రవాహములతో, విలాపములతో నత్యంత బీభత్స మయ్యెను. ఇరుపక్షములను హెచ్చులొచ్చులు కానరావయ్యెను. ఉదయమునుండియు, నాఁడు – వెనుక ముందు చూపు – లేక, యిరుబలములు పెనఁగి యుండెను. సూర్యుఁ డస్తమించినంతనే యూలము నాపిరి.

పర్వతుఁ డిచ్చటికి దండెత్తివచ్చినమీఁదట, రాజసుఁడు, తనకనుకూలు రైన దశార్ణ శూరసేనాధిపతులను బర్వతుని రాజ్యముపై విడియించెను. అందువలనఁ బర్వతునకుఁ గ్రొత్తసైన్యములు వచ్చు నానుకూల్యములు లేకుండెను. పైగాఁ దన రాజ్య మన్యాక్రాంతము కానున్నదని వర్తమానము వచ్చెను. అదే సమయమున రాజసుఁడు,

"చంద్రగుప్తుని మాకుఁ బట్టి యిచ్చుచో నాతఁడు మీ కిత్తు నని చెప్పిన యర్ధరాజ్యమునకు మేము న్నాము. అనవసర ముగ మనకు మనకు యుద్ధమేల! నష్టకష్టము లేల!" అని రాయబార మంపెను. ఆ సంధిమాటలు మనఃపూర్వకము లైనవి కావు. తమకు సామంతసైన్యములు సహాయము వచ్చువఱకుఁ గాలయాపనము చేయఁబన్నిన కుతంత్ర మది. పర్వతుఁడు లోపల నెట్లున్నను బయటికిఁ, "చంద్రగుప్తునికి మే మపకారము చేయము. అతని కర్ధరాజ్య మీ నిచ్చగింతు రేని యుద్ధమాపుడ" మని ప్రతిసందేశ మంపెను. అప్పుడతని మనస్సు పరిపరివిధములఁ బాఱాడఁ జొచ్చెను. అది గ్రహించి, చాణక్యుఁడు, రాక్షసుని బుద్ధికిని యుద్ధతంత్రమునకు నచ్చెరు వొందెను.

ఇప్పుడు చాణక్యుఁడు క్రొత్త తంత్రము పన్నవలసి వచ్చెను. పర్వతరాజ్యముపైఁ బడిన దశార్ణశూరసేనాధిపుల యుపద్రవము మాన్పవలెను. అందులకుఁ బర్వతరాజు పుర రక్షకునకుఁ బర్వతునిచే, "నవనందులు హతులైనట్లు — పాటలీపుత్రము కైవస మైనట్లు — రాక్షసుఁడు పలాయన మైనట్లు — అతఁ డా ప్రదేశముల నుండెనేని జాడ తెలిపిన వారికి లక్షలకొలఁది బహుమతు లిచ్చునట్లు — తమపురమున విజయభేరీలు మ్రోయించునట్లు — ఇంటింటఁ జక్కెర పంచునట్లును నుత్తరము వ్రాయించి పంపెను. అది శత్రుపురులకుఁ

దెలిసిన వారంతకు వారే పాటిపోయెదరని చాణక్యుని యాశ యము. అట్లే జరిగెను.

ఇఁకఁ – చాణక్యుఁడు – నంద నిధనమునకు సత్వర ప్రయత్నములు సాగింప మొదలుపెట్టెను. పర్వతుని సేనా నితోఁ దమసైన్యములో నమ్మకమైనవారు – దిట్టలు నగు నిరువదివేవురకు విభూతి రుద్రాక్షలు ధరింపించి, కాశీరాజు సైనికులవలెఁ దయారుచేయించి, కాశీనుండి పాటలీపుత్రము నకు వచ్చు త్రోవయందుఁ దొలినాఁటి రాత్రియే యుండఁ జేసెను. ఆనాఁడు చాణక్యుఁడు మలయకేతువును బోలిన వాని కొకనికి రాజోచిత వేషము వేయించి, గజారూఢునిం జేసి, కాశీరాజునకు స్వాగతమీఁ బోవువానివలె నా కపటు కాశీరాజ సైన్యముకడ కనిపెను. ఆనాఁటి రాత్రికే నందులు పూర్ణాహుతికి జపశాల కేఁగుదురు. జపశాలయొద్దను, నందులు వచ్చినసంగతి కాశీత్రోవలోని సైనికులకుఁ దెలుపను, దగునేర్పాటులు కావింపఁ బడెను. ఆ రాత్రి – యిఁక రెండు మూఁడు దినములు యుద్ధప్రసక్తి లేదుగదా యన్న పరాకు తోను, యుద్ధ పరిశ్రాంతితోను, నందులును, రాక్షసుఁడును మైమఱచి నిద్రించుచుండిరి.

కాళరాత్రి యయినది. నందుల కాలము సమీపించి నది. యమునినుండివలె జపశాలనుండి పూర్ణాహుతి సమయ మని నందుల కాహ్వానము వచ్చెను. వారు వెంటనే రాక్ష

సుని లేపకయే నిదురకన్నులతో జపశాలకుఁ బయనమైరి. నందులు జపశాల చేరినంతనే కాశీమార్గమున శతఘ్నుల మ్రోఁత మిన్నుముట్టెను. కాశీరాజునకును బర్వతునకును భండనము సంభవించియుండునని నందులనుకొనిరి. అంతలో నక్కడికిరువురు భటులువచ్చి, "మలయకేతువు కాశీరాజుచేఁ బట్టుపడెననియుఁ, బర్వతుఁడు తమపైకి వచ్చుచున్నాడనియు, నాతఁడు సమీపించులోపుననే నందసైన్యమును సహాయముగాఁ బంపునట్లు కాశీరాజు దెలుపుకొన్నాఁడనియు విన్నవించిరి. అది తమపన్నుగడయే యని నందులు సంతసించి, తమవెంటనున్న సైన్యమును బంపివైచిరి. ఒక క్షణమునకుఁ జెఱపట్టిన మలయకేతువును దెచ్చుచుంటిమను నెపమునఁ గృతక కాశీరాజసైన్యములు వచ్చి నందులను జుట్టుముట్టెను. జపశాలలో మంటలు మిన్నుముట్ట లేచెను. నందులసహాయులగు నైసర్గిక సాహసమునఁ బోరి సైన్యముల జెండాడుచుండిరి. ఇంతలోఁ జాణక్య చంద్రగుప్తులు సర్వసైన్య సమేతముగ వచ్చి కలిసికొనిరి. అందఱుఁ గలిసి విజృంభించి, నందులు తొమ్మండ్రను నిశ్శేషముగ నఱికివైచిరి. సకాలమునకు సాయపడ రాలేక, రాక్షసుఁడు నంద మరణమునకుఁ బశ్చాత్తప్తుఁ డయ్యెను.

ఇప్పటికిఁ జాణక్యుని మొదటి శపథము నెఱవేఱినది, రెండవదియైన చంద్రగుప్తుని సింహాసన మెక్కించుట

మిగిలి యున్నది. అది యంత సులభముగ నగునది కాదు. అర్థరాజ్యము నాక్రమింపఁ బర్వతుఁడు డంగలు సాఁచుచున్నాఁడు. వానిపీడ తొలఁగించుకొన వలయు. అంతియకాక, నందమంత్రియగు రాక్షసుఁడు నిక్కపుస్వామిభక్తుఁడు. స్వామిపరోక్షమునఁ గూడ శత్రువుల సమూలముగఁ జక్కడఁచి, వారి యాత్మలకు శాంతిఁ గూర్పఁ దలఁపుకొన్నవాఁడు. మంత్రి రాక్షసుఁడొక విషకన్యను గొని, పెంచుచుండెను. విషకన్య యనఁగా - వయోనుగుణముగ మాత్రావృద్ధిచేయుచు విషము తినిపించి పెంచినకన్య. ఆమెయంగము లన్నియు విషమయములై యుండును. చూచుటకు సర్వాంగసుందరి. అందుకు దగిన సంగీతసాహిత్యాది సకల కళలు నేర్చియుండును. రాజులు సామాది చతురుపాయములు వ్యర్థములు కాఁగా, శత్రుసంహారమునకు విషకన్య నుపయోగింతురు. ఆమె యంగస్పర్శ యైనంతనే యెట్టివానికిని దత్క్షణమే మరణము సిద్ధించును. అట్టి యకన్యను దెప్పించి రాక్షసుఁడు జీవసిద్ధితో, "ఈమె తమ చెంతకుఁ జిక్కిన వల్లభరాజు కూఁతురు. ఈ సుందరాంగి జ్యేష్ఠనందునకుఁగా నుద్దేశింపఁబడెను. అతఁడు మరణించుటచే నతని రాజ్యముతోఁ గూడ నీమెయుఁ జంద్రగుప్తుని ధనమే యయినది. కావున, నీ వీమెను నాతని శయ్యాగారముఁ జేర్పు"మని చెప్పి పంపెను. చాణక్యుఁడా రాక్షసుని కుట్ర కనిపెట్టి, చంద్రగుప్తుఁ డన్యకాంతల నొల్లఁడనియు,

సింతటి గౌరవబహుమానమునకుఁ బర్వతుఁడే యర్హుఁడనియు నుడివి, దాని నతనికై పంపెను. పర్వతుఁ డా గుట్టు తెలియక యా సుందరిఁ గామించి, పంచత్వము నందెను. అంతటితో వానిపీడ తొలఁగెను. పితృ మరణమునకు మలయకేతువు భయమంది, యటనుండి తన దేశమునకు బాఱిపోయెను.

రాక్షసుఁ డంతటితో నూరకొనక, చంద్రగుప్తుఁడు పట్టాభిషిక్తుఁడై పురద్వారము ప్రవేశించునప్పుడు తోరణమున మారణయంత్రము నమర్చి చంపింపఁ దలంచెను. చాణక్యుఁడు, పర్వతుని మరణమునకు విషాదము వెలిఁబుచ్చి తమ వాగ్దానము ప్రకార మాతని తమ్ముఁడైన విరోచనునికి నర్ధరాజ్యాభిషేకము జరిపి, చంద్రగుప్తుని దుస్తులు సొమ్ములు తొడిగించి, యేనుగుపైఁ బట్టణమున నుత్సవము చేయించెను. అది చంద్రగుప్తు నుత్సవమేయని యందఱు భ్రమించిరి. రాక్షస నియుక్తులు తోరణాస్థిత మారణయంత్రము నాతనిపైఁ బడవైచిరి. విరోచనుఁడు మడిసెను.

చంద్రగుప్తుని శయనాగారమున రహస్యముగ ఘాతకు లుంచఁబడిరి. వారును జాణక్యునిచేఁ గనుగొనఁబడి శిక్షితులైరి. రాజవైద్యుఁడు రాక్షస ప్రేరితుఁడై, చంద్రగుప్తుని మనోల్లాసమున కని మందులోఁ గలిపి, విషము నియ్య సిద్ధపడెను. అతని వాలకము ననుమానించి చాణ

క్యుఁడు, 'మొదట మీరు పుచ్చుకొనుఁడు. మీ యారోగ్యముఁ జూచుకొని చంద్రగుప్తుఁడును సేవింపఁగలఁడు' అని, యా యౌషధము నాతనిచేఁ ద్రావించెను. అందలి విషము వలన వైశ్యుఁడే మరణించెను.

ఇట్లు రాక్షసుఁడు సేయుకుట్రలకుఁ జాణక్యుఁడు సేయు ప్రతీకారములను గనుఁగొని, పౌరు లాతని యద్భుత శక్తిని గూర్చి పొగడుచుండిరి. చాణక్యుఁడును వృద్ధరాజు సర్వార్థసిద్ధి జీవించి యుండుసంతవఱకును, రాక్షసుఁడు ప్రధానామాత్యపదవి స్వీకరింప నంతవఱకును చంద్రగుప్తునకు నెమ్మది యుండదని బాగుగాఁ దెలిసికొనెను. అదికారణముగఁ జాణక్యుఁడు చంద్రగుప్తునిఁ జేరఁజీరి, 'నాయనా! నీ విట్లుపేక్షించి యూరకుండరాదు. నీ పితామహుని దర్శించి, యాతని యాశీస్సులందు రమ్ము' అనెను. చంద్రగుప్తుఁడాతని యాజ్ఞను శిరమునఁ దాల్చి, వృద్ధపితామహు నికడకేగి, యాతనికిఁ బ్రణమిల్లి నిలిచెను. అంత నా వృద్ధరాజు, 'బాలుఁడా! నివైన నాయుష్మంతుఁడవు కమ్ము. నేనార్జించిన కీర్తిని నీవును నార్జింపుము. నీకు ద్రోహముఁ దలఁచిన వారెల్లరు దుర్గతిఁ బాలైరి. ఈ యంతఃపురమున నున్న వారిని గౌరవభావముతో రక్షింపుచుండుము. నేను దపోవనముల కేగెదను. నీవు పుత్త్రపౌత్త్రాభివృద్ధిగలిగి వర్ధిల్లుము.' అని యాశీర్వదించి, తాను మఱునాఁడే సభార్యుఁడై వనముల కేగెను.

ఇది చాణక్యుఁ డెఱిఁగి, 'వృద్ధరాజు వనములకుఁ బోయెనను వార్త రాక్షసునకుఁ దెలిసినచో నాపద వాటిల్లును. అతఁడు సర్వార్థసిద్ధినిఁ జేరి, క్షత్త్రియబాలు నొకని దెచ్చి, యాతనికి దత్తపుత్త్రునిఁగాఁ జేసి, పిమ్మట నేరాజునైన నాశ్రయించి చంద్రగుప్తునకు ముప్పు దెచ్చును. కావున, నిట్లుపోనీక యుండు నట్లు సర్వార్థసిద్ధిని దపోవనములందే తుద ముట్టించుట లెస్స' యని తలపోసి, కొందఱు భటులను బిలిచి, వారి నక్కార్యమునకు నియోగించెను.

వృద్ధరాజు తపోవనములందొక్కచోట నొక్క పర్ణశాల నిర్మించుకొని, యందుఁ దన భార్యతో గురూపదిష్ట మార్గమున మెలఁగుచు, నొక్కనాఁడు యోగముచే శరీరము విడిచెను. భార్యయగు సునందాదేవియుఁ బతితో సహగమన మొనర్చెను. చాణక్యుఁడు పంపియున్న భటులా ప్రదేశమునకు వచ్చి, రాజు మరణవార్త విని, యా విషయము తమ ప్రభువునకుఁ దెలుప మరలిపోయిరి.

ఇట్లు తన ప్రయత్నము లన్నియు విఫలములై పోఁగా, రాక్షసుఁ డిఁక నిలునుండ రాదని తనభార్యాపుత్త్రులను చందనదాసను తన స్నేహితునింట, దాఁగ విడిచి, యెట్లయినను చంద్రగుప్తునిపైఁ గసితీర్చుకొనుటకు మలయకేతువు నాశ్రయింపఁ బోయెను. అట నాతని యాస్థానమునఁ గుదురుకొని, యాతనికిఁ జాణక్యచంద్రగుప్తులపై విరోధమును రగుల్గొలుపుచుండెను.

పాటలీపుత్రమునఁగల రాక్షస పక్షము వారలందఱను వెడలఁగొట్టి ననుమిషతో భాగురాయణ- జీవసిద్ధి- భద్రభటాదులను బర్వతరాజ్యమునందలి రాక్షసుని తంత్రములఁ దెలిసికొని రాఁ జాణక్యుఁడు పనిచెను. వారును జంద్రగుప్తుని విరోధులవలె నటించుచు, మలయకేతువు నాశ్రయించి, యక్కడి వర్తమానముల నెప్పటికప్పుడు తెలిపి పుచ్చుచుండిరి. చందనదాసును రాక్షసుని కుటుంబమున కాశ్రయ మిచ్చెనను నేరముపైఁ గారాగారమునం దుంచెను. చందనదాసు నింటనున్న రాక్షసుని కుటుంబమునుండి యెట్లో రాక్షసముద్రికను జాణక్యుఁడు సంపాదించి యుండెను. కౌముదీమహోత్సవము జరుపుఁట్లు చంద్రగుప్తుఁడు ప్రకటింపఁగాఁ, గావలసి దానిని జాణక్యుఁ డాపుదలచేసి, బయటికిఁ జంద్రగుప్తునితోఁడి వైమనస్యమును బ్రకటించెను. అది వేగులవారిచే విన్న రాక్షసుఁడు, ఇదే సమయ మని పాటలీపుత్రముపై దాడి వెడల నుంకించెను. ఆసందర్భమున జీవసిద్ధి భాగురాయణులు, పర్వతరాజుకడకు విషకన్య నంపినది రాక్షసుఁడే యనియు, మరలఁ జాణక్యచంద్రగుప్తులకు భేదము కలిగించి, చంద్రగుప్తునికడఁ దనమహామాత్యపదవిని బడయ నపేక్షించుచున్నాఁ డనియు మలయకేతువునకుఁ దెలియఁజేసిరి. అదేసమయమునకు మలయకేతువు రాక్షసునకుఁ బూర్వమిచ్చిన యాభరణములతోఁడి పెట్టెతో నొక యుత్తరమును దీసికొని పోవు గూఢచారుఁడు పట్టుపడి యా

తని కొఱకుఁ దేఁబడెను. వాని కడనున్న రాక్షసముద్ర తోడి యుత్తరము మలయకేతువు ననుమానమును దృఢపఱచెను. వాఁడు రాక్షసునిఁ గపటబుద్ధి గలవానిగా నెఱిఁగి, మొగమోటము లేక నిందించి, నిరాకరించెను. రాక్షసుఁ డింక నటనుండ నొల్లక, పాటలీపుత్రమునకే వచ్చెను.

అప్పుడే చాణక్యుఁడు చందనదా సురిదీయఁ బడునని చాటింపించెను. తనకుటుంబమును సంరక్షించిన మహానీయుఁడు తనకై యురితీయఁబడుటకు రాక్షసుఁడు సమ్మతింపక, యురిదీయు సమయమునకు సరిగా వధ్యస్థానమునకు వచ్చి, 'యతనికి బదులుగ నన్నురిదీయు'డని యడ్డపడెను. భటులు, "మిమ్మురి తీయుటకు మా కుత్తరువు లేదు. మీకు మిత్రునెడల ప్రేమ కలదేని, ప్రభువుల యనుమతిఁ బొందుఁడు. అందాఁక నురిదీయ నాపుదుము" అని, యతనిని జాణక్యుని దగ్గఱకుఁ గొనిపోయిరి.

చాణక్యరాక్షసులు కలసికొనిరి. రాక్షసుని సగౌరవముగఁ జాణక్యుఁడు సన్మానించెను. అప్పుడు వారిరువురి యంతరంగములును శుద్ధములయ్యెను. చాణక్యుని రాక్షసుఁ డిదివఱకు సమీపించి, సమీక్షించి యెఱుఁగఁడు. ఇప్పుడు కన్నులార నాతని పాండిత్యప్రకర్షతోడి శాంతము వెలిఁజిమ్ము బ్రహ్మతేజస్సు - సర్వసమత్వదృష్టి - వినయగర్భిత

మైన వాగ్వైఖరి - విశ్వాసమైన పావనసచ్ఛీలతఁ గనుఁగొని, రాక్షసుఁడు, ముగ్ధుఁడయ్యెను. ఇదివఱకే యతని తంత్రప్రావీణ్యమునకు మనమున మెచ్చునతఁ డిప్పు డాతని గంభీరమూర్తికి నమోవాకము లర్పించెను. అప్పుడు చాణక్యుఁడు రాక్షసు నుద్దేశించి, "అమాత్యవర్య! చంద్రగుప్తుఁడు - సజ్జనుఁడు, నిర్దోషియగుటచేతను, నేను దపోవనమున కేఁగవలసి యుండుటచేతను, వానికి నతనికి సంధి పొసఁగించు నిమిత్తము నే నిన్నితంత్రము లాచరింపవలసి వచ్చెను. కాని, మీయెడల నాకు ద్వేషములేదు. ఈ నవనందులుఁ, బర్వత రాజాది దుష్టక్షత్రియులు, బౌద్ధాచార్యకాది మతములయందు విశ్వాసముంచి, వేదోక్త సదాచారముల జరుపక మీవంటి యుత్తమ సచివులయభిమతము చొప్పున నడచికొనకుండినది తమకు విదితమే. భృగువంశజాతులైన మా గురువులు వీని నన్నిటిని దమ చిత్తమునకుఁ దెచ్చుకొని, లోకసంరక్షణార్థము దండనీతి సాంతముగ నాకు నుపదేశించి. "దుష్టక్షత్రియులను హతముచేసి, యాచోట శిష్టునినిలిపి, ధర్మము నుద్ధరింపఁ జేయుము. అదియే మాకు నీ విచ్చు గురుదక్షిణ." యని యానతిచ్చుటచే, నే నీపని కొడిగట్టితిని. మీకుఁ జంద్రగుప్తుని యెడ దయయుండినను లోకాపవాదమునకు జడిసి, నందులఁ బ్రేమించితిరి. అయినను "యతోధర్మస్తతోజయ" అన్నట్లు మీ కేవిషయమందును సాటిరాని నేనుబన్నిన యుపాయములు కొనసాగి,

మీ పౌరుషము తలయెత్తకపోయెను. ఇఁక నీ చంద్రగుప్తుని నిమిత్తమాత్రునిగ నుంచుకొని, సకల దేశాధీశులను లోఁబఱచుకొని, పాషండాదుల నిగ్రహించి, ధర్మమును పాలింపవలయును.” అని సవినయముగ నభ్యర్థించెను. రాక్షసుఁడును, “తపోధన! మీ సూనృతవాక్యమును వినుటవలన నామనఃకల్మషము తీఱినది. మీ యాజ్ఞాను సారము మెలఁగువాఁడ” అని యంగీకరించెను. పిదపఁ, జంద్రగుప్తపట్టాభిషేక మహోత్సవము జరిపి, నిస్సంగుఁడై చాణక్యుఁడు తపోవనముల కరిగెను.

చాణక్యుని యంతరంగ జీవిత మతిశ్లాఘనీయము. తీవ్రనిత్యాచారానుష్ఠాత! యావజ్జీవ బ్రహ్మచర్యావలంబి. శాంతుఁడైనను నుగ్రశిక్షకుఁడు. జీర్ణకుడ్యపుఁ బర్ణశాలయందుఁ ద్రేతాగ్ని సంరక్షణా విహితకర్మలఁ బరిపాలించుకొనుచు, బ్రాహ్మణవృత్తిపరుఁడయ్యు, రాజనీతి ధురంధరుఁడు. అలంకార - ఆడంబర వర్జితుఁడు. ఐహికభోగార్జనాశక్తి సంపన్నుఁడయ్యు, జితేంద్రియుఁడు. సుఖదుఃఖ - ఉదాసీనుఁడు. ఇతని చరిత్రము మహోన్నత దశయందును సర్వసంగ పరిత్యాగమునకుఁ బ్రమాణమై యుండెను. శాంతాశ్వ - ఉగ్రాశ్వములఁ బూన్చిన శకటంబును ద్రోలు సారథివలెఁ బ్రవర్తించువాఁడు. “స్వధర్మమును రక్షించుకొనవలయును. క్షత్రియకృత్యములలో ఫలప్రాప్తికిఁ గావ

లసిన మార్గమేదియైనను నీతియుక్తమే యగును. అత్యాచారములనె ద్వేషింపవలయుఁగాని, వ్యక్తులను ద్వేషింపరాదు. మంచిగుణ మెవరియందున్నను గౌరవింపలయును." అను విషయములను దా నెఱిఁగి, యట్లు నడచి, లోకమును నడిపించిన మహాదర్శనీయుఁడైన యాచార్యుఁడు - చాణక్యుఁడు. ఇట్టి మహాపురుషుఁడు మరల మన కెన్నఁడబ్బునో !



# యుగంధరుఁడు

భారతవర్షము సుజ్ఞాననిలయము. అఖిల ప్రపంచము నజ్ఞానాంధకారబంధురమైయున్న యవసరముననే, యఖండ శాస్త్ర చర్చల సాగించి, యతీతములు నగోచరములు నయిన యాధ్యాత్మిక విషయములందు సైతము నారితేఱినది. సర్వతోముఖమయిన తన విజ్ఞానకిరణ జాలములో దిగ్విదిక్కుల దేదీప్యమాన దివ్యప్రభలఁ దేజరిల్లఁజేసినది. నేఁడు పరిణతిఁ జెందిన యేశాస్త్రరహస్యములును, నార్యావర్తమునందలి యార్ష విజ్ఞానములోని బీజము లేయని 'ఋజు'వగుచున్నవి. చరిత్రకారుల విమర్శనలకు, నూహలకు నందక భరతవర్షము యొక్క ప్రాచీనతకంటెఁ బ్రజ్ఞానమును, బ్రజ్ఞానమునకంటెఁ బ్రాచీనతయు వెనువెనుకకే వెడలుచున్నవి. వేదములు కాది నేఁటికిని వివాదగ్రస్తమయినే యున్నది. వానిలో తడవఁబడని విజ్ఞాన విషయములు, నాగరకతలు, సాంఘిక సమస్యలు, జీవితపరిణామములు, లేవని ఖండాంతరులు విశదీకరించిన మీఁదఁగూడ, భారతీయులు తమ ప్రాచీనౌన్నత్యమును బునరుద్ధరింపవలయు బాధ్యతను గ్రహింపఁ జాలకుంటరో చింతింపవలసినది. అంకెలలో లెక్కింపఁ గలిగినంత యలఁతికాలమునుండి కన్నులు తెఱచినవారికి

వేదముల యపౌరుషేయత విభ్రమము కలిగించుట వింత లోని విషయము కాదు.

ఆంధ్ర దేశచరిత్ర ప్రపంచములోఁ బేరుగాంచినది. ఆంధ్రు లాకారపుష్టియందే కాక, వీర్యవిక్రమములందును, వర్తక వ్యాపారములందును, ప్రజ్ఞాపారీణతయందును, సంగీత సాహిత్య శిల్పాది లలిత కళాపోషణమునందును, శాస్త్ర చర్చా సామర్థ్యమునందును, ఖండఖండాంతరుల ప్రశంసకుఁ బాత్రులై యుండిరి. నేఁటికిని మడుగుఁబట్టు చెలములుగా మహనీయు లెందఱో మన యాంధ్రులు కలరు. మన పూర్వుల మహిమల ననుదినము, మననము చేసికొనుచు మరల నట్టి యౌన్నత్యము నందఁ బ్రయత్నించుటే మనవిధి.

"సత్య హరిశ్చంద్రుఁడు – సాహస విక్రమార్కుఁడు" అను పౌరాణికములతోఁ బాటు "సంగ్రామ ధనంజయ – దానకర్ణ – సుయోధనాభిమానము" అను నైతిహాసికములతోఁగూడ, "చాణక్యనీతి – యుగంధర ప్రజ్ఞ" అను చారిత్రకములు ననుదినము మన వెనుఁగువారి నాల్కల నానిన నానుడులు. ఆయా ధర్మములయందు గరిష్ఠ ప్రాధాన్యత గడించినవారే యాదర్శముగఁ దీసికొనఁ బడుదురు గదా! అట్టిచో యుగంధర ప్రజ్ఞ పై యాదర్శపురుషుల కాయాగుణములయందుఁ గలిగినంతటి యున్నతి నందియుండ వలయు ననుట యూహాతీతము కాదు. అట్టి యుగంధరుని

యుదంతమునందు విమర్శకులకుఁ దృప్తికరమైనంతటి చారిత్రకాధారములు దొరకకుండుటకుఁ బూర్వుల యశ్రద్ధకంటె మన దురదృష్టము ప్రబలమైన కారణము. ఆంధ్రలోకమునందు మాత్రము నీమహనీయుని కథ తాతలకాలము నుండియు వాడుకలో నున్నది. ఇప్పటి కీతనికథ వివరించిన గ్రంథములలో మొదటిది శ్రీ. వేదము - వేంకటరాయ శాస్త్రిగారిచే విరచితమైన ప్రతాపరుద్రీయ నాటకమే. వారును వాడుకకథను సంస్కరించి, గ్రాంథికరూప మిచ్చి యుందురని తోఁచుచున్నది. మనము దానినే యనుసరింతము.

యుగంధరుఁడు పదుమూఁడవ శతాబ్దాంతమున నఖండాంధ్రసామ్రాజ్యమును నతివైభవోపేతముగఁ బాలించిన ప్రతాపరుద్రుని మంత్రియని ప్రసిద్ధి. ప్రతాపరుద్రుని వద్ద ననేక మంత్రులుండిరి. వారిలో రేచర్ల - సింగమ నాయనికి 'రాయబందీ విమోచక' అనియు, నాగయ గన్న మంత్రికి 'నీతి యుగంధరుఁ' డనియు బిరుద నామములున్నట్లు తెలియుచున్నది. బహుశః ఆ నీతి యుగంధరుఁడే-యుగంధరుఁడని వెలసెనేమో! ఈ బిరుదమువలన నా కాలమునకుఁ బూర్వమింకొక యుగంధరుఁ డుండియుండవలెనను ననుమానముగూడఁ గలుగుచున్నది. ఇతనిచరిత్రము ప్రతాపరుద్రునిఁ జెఱనుండి విడిపించినప్పటినుండియే పేరునకు

వచ్చినదనుట నిస్సంశయము. ఆ కాలమునందే ప్రతాపరుద్రుని కంకితముగనే విద్యానాథపండితునిచే రచింపఁబడిన సంస్కృత ప్రతాపరుద్రీయమను గ్రంథమున యుగంధరుని ప్రశంస కానరాకుంకుట కాగ్రంథము ప్రతాపరుద్రుని చెఱకుఁ బూర్వమే రచింపఁబడిన దగుట కావచ్చును. ఏది యెట్లుండినను యుగంధరుని చరిత్ర చాలకాలమునుండి యాంధ్రలోకమునఁ బండిత పామర సమ్మతము, నాదరణీయమునై యలరారుచున్నది.

కాకతీయ సామ్రాజ్యమున కేకశిలానగరము (ఓరుగల్లు) రాజధాని. ప్రతాపరుద్రుని పాలనమున నానగరదశ యత్యున్నతమై యుండెడిది. ఆనాఁటి యా పురవైభవము - వైచిత్ర్యము వల్ల భామాత్యవిరచితమైన (శ్రీనాథ రచితమను కొందఱు) క్రీడాభిరామమున విశేషముగ వర్ణింపఁబడినది. ప్రతాపరుద్రుఁడు సుప్రసిద్ధ మహారాజ్ఞియయిన రుద్రమదేవికి దౌహిత్రుఁడు. ఇతని తలిదండ్రులు; ఉమ్మక్క - వీరభద్రరాజులు. రుద్రమదేవికిఁ బుత్రసంతానము లేమిచేఁ బ్రతాపరుద్రుని దత్తుచేసికొనెను. ఇతడు క్రీ. శ. 1295-96 సంవత్సరముల మధ్య సింహాసన మెక్కెను. రాజ్యవిస్తరణము నందును, బరిపాలనమునందును బ్రావీణ్యమునూని, యుద్ధ ధుర్యుఁడు - నభిగమ్యుఁడునై 'ప్రతాపరుద్ర దేవచక్రవర్తి' యను సార్థక నామధేయముతో నారాజశిఖామణి రాజ

ల్లెను. తన్నుఁజూచి కన్నుఁగుట్టి, తన సామ్రాజ్యము నాక్రమింపఁదలంచిన యవనులను మాఁడుసార్లు పాఱఁదోలెను. ఎదురు తిరిగిన సామంతరాజుల నడఁచెను. రాజ్యమును శాంతియుతముగఁ జేసి, విద్యావినోదములతోఁ గశాస్త్రిప్రియుఁడై కాలము గడవుచుండెను.

ప్రతాపరుద్రుని ముఖ్యమంత్రి యుగంధరుఁడు. అతని నీతిశాస్త్ర వైదగ్ధ్యము, రాజతంత్ర నిపుణత, ప్రజ్ఞాప్రావీణ్యము, యుద్ధపరాక్రమము, దేశదేశాంతరములందు :—

"ఆయన గాలిని చేనుసు; దోయమతో నలుసు బాగలతో కొడలిదుఃఖ"

అనియును,

"వీరయుగంధర్ పేరుచెప్పితే నీరు విడుచు ఘోరా
రుద్ర యుగంధర్ ముద్రపెట్టితే నిద్రపోదు హాథీ.
బాలయుగంధర్ లీలపాడితే పేలదుర తుపాకీ.
సూరయుగంధర్ బీరము వింటే పారదుర ఫిరంగీ."

అనియును, విస్తృతమై యుండెను.

యుగంధరునకు జనార్దనుఁడను తమ్ముఁడుండెడివాఁడు. అన్ని విధముల నన్నదమ్ములు ప్రతాపరుద్రునకుఁ గుడిభుజము నెడమ భుజములై యుండిరి.

ఆకాలమున ఢిల్లీ సామ్రాజ్యమున 'ఘయాజుద్దీన్ తుగ్లక్,' అనునాతఁడు పట్టాభిషిక్తుఁడై యుండెను. అతఁడు

తన పెద్దకుమారుని, 'ఖుస్రూ' అను వానిని, గప్పసుకట్టి నిరాకరించిన ప్రతాపరుద్రునిపై క్రీ. శ. 1320-వ వత్సరమున బంపెను. ఆతఁ డప్పటికి నాంధ్రసైన్యముతోఁ బరాజితుఁడై పాఱిపోయెను. కాని, పగదీర్చుకొనుటకు మరల సంవత్సరమునకే యేకశిలానగరముపైకి వచ్చెను. ఆ రాకలోఁ జాల చిత్రమును, మోసమును గలవు. "ఢిల్లీపైకిఁ గాబూలువారు దండెత్తివచ్చుచుండె ననియుఁ, బ్రతాపరుద్రుని సుసైన్యముగ సహాయము రమ్మనియు, స్వయముగ నాతఁడు రా నిరాకరించిన సైన్యమునైనఁ బంపవలయు ననియు" రాయబారము తెచ్చితిమని పాదుషావై పువారు పైకిఁ దెలుపుచుండిరి. ఎట్లైనను బ్రతాపరుద్రునకుఁ గష్టమే. అట్లు వచ్చినవారిలోఁ బ్రతాపునకుఁ గానివారైన దేవగిరి రామదేవుఁడు మొదలగువారు చేరియుండిరి. వలీఖానుని (ఖుస్రూ సేనానాయకుఁడు) దండు పగళ్లంతయు నడవులలో నాఁగి, రాత్రులందుఁ బయనము సాగించుచుండెను.

అది ప్రతాపునకుఁ గానికాలము. అఖండపరాక్రమ విజయములకు మురిసి, 'యింక మనపై కెవరువత్తురు!' అన్న తాత్సారముతో, మహామంత్రి యుగంధరుఁడు రామేశ్వరయాత్రకుఁ బోయి యుండెను. ప్రతాపరుద్రుఁడును మృగయావినోదముల కని సంక్లుప్తపరివారముతోఁ గొన్ని దినము లడవులలోనే మకాము వేసెను. జనార్దనమంత్రిపైననే రాజ్యాంగ మంతయు మోపఁబడి యుండెను.

మహారాజును, మహామంత్రియు నూరలేనప్పు డున్న ట్లుండి యవనసైన్యము లోఁదుగంటిని ముట్టడించెను. ఊరిలో నున్న చిన్నమంత్రి యాత్రకు వెడలిన యుగంధరున కా సంగతి తెలుపుచుఁ ద్వరగా రమ్మని వేగి రాపుటప్పాల ద్వారా వర్తమాన మంపెను. వనములలోఁ దిరుగాడు ప్రభువులకు హెచ్చరిక చేసెను. నాసికనుండి భద్రగిరివఱకు గోదావరిని బురుగుగూడ దాఁటకుండునట్లు యానపాత్రములఁ బగులఁ గొట్టించెను. ఊరిలోని లక్షసైన్యమును యుద్ధమున కాయత్తము చేసెను. అనుమకొండలోని లక్ష సైన్యమును గోటకుఁ గాపుదలకు నియమించెను. ఏడులక్షల సైన్యమున కధిపతియయిన నరసింహదేవరాయలను సిద్ధముగ నుండుమని యాజ్ఞాపించెను. తన వేగులవారిని జాఁకళ్ళుగా, మంగళ్ళుగాఁ, దురుష్కుల రహస్యములఁ గనుఁగొని రాఁ బంచెను. తన సహాధ్యాయి యగు చకుముకి శాస్త్రిని జోస్యునివేషమున వలీఖానుని కుట్రలఁ దెలిసికొన నియోగించెను. కాని, యన్నయు, నధిపుఁడు లేనిదే యుద్ధ యోధనమున కుపక్రమించి, వచ్చినవారి నచ్చటనే మట్టు పెట్ట సాహసింపలేను. అట్లు నిదానించి యాలోచించుటయే యాతని లోపము.

వలీఖాను సంగతు లన్నియు గ్రహించి, ఖుస్రూ ఫిరోజ్ ఖానులను బట్టణము ముట్టడింప నుంచి, తాను గొంత

సైన్యముతో నడవులలో రాజును బొంచి తిరుగుచు, మృగయా పరిశ్రాంతుఁడై యొంటిగ వటవృక్షము క్రీనీడ శయనించి యున్న రాజును శృంఖలాబద్ధునిం జేసెను. అంత నాతఁడు యాదృచ్ఛికముగ వచ్చిన వైదేశిక నావికులచే గోదావరి నుత్తరించి, ప్రతాపుని బందీగాఁగొని ఢిల్లీ చేరెను. అట సుల్తానుతోఁ దనపరాక్రమముఁ బొగడికొని, 'రాజును యుద్ధమున జయించి, పట్టుకొని వచ్చితి' నని డంబములు కొట్టెను

మరునాఁడు మహామంత్రియైన యుగంధరుఁడు పురమునకు వచ్చెను. తమ్మునివలన వృత్తాంతము తెలిసికొనెను. గాయపడి వచ్చిన గుఱ్ఱమునుగాంచి, రాజు నుదంతము నూహించెను. పశ్చాత్తాప మనునది యా ప్రాణికి లేదు. ఇంతలో విద్యానాథుఁడు పడవలో రాజుతో మాట్లాడి, రాజముద్రికతోఁ గూడ వచ్చి చేరెను. అప్పటినుండి యుగంధరుని తంత్రప్రయోగ మారంభ మయినది.

"రాజు ఢిల్లీకిఁ గొంపోఁబడినాఁడు. ఉపాయముచేతఁ గాని, పరాక్రమము చేతఁగాని, యెట్లో యాతనిని విడిపించుకొని రాఁగల" నను నమ్మకము యుగంధరునకుఁగలదు. ఊరక విడిపించుకొని వచ్చినఁ జాలదు. అట్లు సేయుటలోఁ గూడ లోకమునకుఁ దన చాకచక్యము దెలియవలయు; రాజున కపనింద తొలఁగవలయు. అంతఁదనకును జనార్దను

నకును, విద్యానాథునకును, రాజమాతయగు ముమ్మడంబకును దప్ప, రాజ్యములోని ప్రజలకుఁ, బరివారమునకుఁ, దుదకు విశ్వాసపాత్రు లయిన దండనాథులకు సైతము దెలియకుండునట్లు యుగంధరుఁడొక తంత్రము పన్నెను. ఆ తంత్రమిది: రాజు వేఁటలోఁ గ్రూరసత్త్వముతో గాయపడి ప్రక్క పల్లెటూరి పాకయింట నున్నట్లు రాజముద్రతో నుత్తరము వ్రాయించి తెప్పించెను. అంత నాతఁడు తమ చాకళ్లలోఁ బరమమూర్ఖుఁడును, నాకారమున రాజు ననుకరించువాఁడును నగు పేరిగానికి రాజవేషము వేయించి, రాత్రివానిని బాకుసిల్లు చేర్చి, యక్కడ నుండి పల్లకిలో నూరేగింపుతోఁ దెచ్చెను. అంతియగాక, రాజు స్వస్థత లేక యున్నట్లును, రాజు వేషముతో నున్న చాకలి పేరిగాని, రాజే యనుకొని వలీఖాను పట్టుకొని పోయె ననియుఁ బ్రథ పుట్టించెను. ఇందసంభవ మేదియు లేనందున సందఱును నమ్మియుండిరి. మహారాణి సైతము ప్రాణనాథుఁడస్వస్థతతో నుండెనని వినియు, వైద్యచికిత్సానుసారము స్త్రీదర్శనము కూడ దనుటవలనఁ దానును దర్శనము మానియుండెను.

వలీఖాను పోయిన పోక తెలియని ఖుస్రూఫిరోజీ ఖానులకుఁ గూడ నిదే సత్య మనిపించెను. సేన యంతయు పాలె మార్పుఁ బడఁగా ఖుస్రూ ఢిల్లీకిఁ బాఱిపోయెను.

ఆతనివలనను, చెకుముకి శాస్త్రివలనను నీవిషయము విన్న వలీఖానునకుఁ గూడ నేను భ్రమతోఁ జాఁకలి వానినే పట్టి తెచ్చితి నేమో'యని యనుమానము పుట్టి, యీ గుట్టు బయటఁబెట్టు నేమో యని తనవాఁడైన ఖుస్రూను దానే చంపి వేయించెను. తుదకు ఢిల్లీసుల్తాను గూడ వలీఖాను చాఁకలిని బట్టి తెచ్చి, తన్ను మోసము చేసెననియుఁ దన మోసము వెల్లడించు నని యాతఁడు ఖుస్రూను జంపించె ననియు నమ్మి, వానిపై నసూయ్యమును. ద్వేషమును గలిగి వానిని జంపించెను.

రాజమాతకు నేడునెలలలో నీకుమారునిఁ దెచ్చి నీ కప్పగింతునని మాటయిచ్చి, రాజ్యమును విద్యానాథ జనా ర్దనులచేతఁ బెట్టి, యింకను దన తంత్రనాటకమునకుఁ గావల సిన పాత్రధారులను సిద్ధము చేసికొని, యొకరిద్దఱికి మాత్రము తనయానవాళ్లు దెలిపి, యుగంధరుఁడు ఢిల్లీకిఁ బయన మయ్యెను. చెకుముకిశాస్త్రి యంతకు ముందే ఢిల్లీలో వలీఖాను నాస్థానపు జోస్యుఁడుగాఁ జేరియుండెను. శాస్త్రి తనపై ఖానునకు నమ్మకము పుట్టించి, సుల్తానును జంపి, వలీఖానును సింహాసన మెక్కఁ బ్రోత్సహించి, రాఁబోవు వ్యాపారులకు లంచమిచ్చుటకుగాఁ, బ్రతాపరు ద్రునియొక్కయు, నాతని గుఱ్ఱముయొక్కయు నాభరణ ములను లాగికొని యుండెను.

ఏమి చిత్రము! ఢిల్లీ బజారులలో నొక తిక్కవాఁడు తిరుగుచున్నాఁడు. అతఁడు, గంభీరమూర్తి. చింపిగోన పట్టలతోఁ గప్పబడినను వాని శరీరము పౌరుష పరాక్రమముల సూచించుచుండెను. ఎంత దుమ్ము గొట్టుకొన్నను, నాతని యాస్యమునందలి తేజోరశ్మి తొంగిచూచుచునే యుండెను. వెఱ్ఱిమాటలు - వెక్కిరింపులు - వికటస్వరము - వికారచేష్టలు - వెంటఁ గుక్కలు :—ఆ కారణజన్ముఁడైన వెఱ్ఱివానిని - నిజమైన వెఱ్ఱివారు వీథి వీథుల వెంబడించుచున్నారు. మానము లేక - మర్యాద లేక - అలుపు లేక - ఆహారము లేక - నిద్ర లేక - నీరు లేక - తన్ను రాత్రింబవళ్లు ననుసరించుచున్న రాజభటుల కన్నులలో దుమ్ము చల్లి, రాజవీథులలో 'ఢిల్లీసుల్తాన్ పట్టుకి హోతాహై' అని యఱచుచుఁ దిరుగుచున్న యావ్యక్తి నిజముగ వెఱ్ఱివాఁడా? కాఁడు. ప్రతాపరుద్రుని బహిఃప్రాణము—ఆంధ్రసామ్రాజ్య అభ్యుదయముల మూలకందము - ఏకశిలానగరమున రాజసన్మానము నందిన రాజనీతిజ్ఞుఁడు - మహాప్రజ్ఞానిధి - మహామంత్రి - యుగంధరుఁడు. ఆహా! ఏమి! అతని రాజభక్తి! ఏమి! దేశాభిమానము! ఎంత స్వార్థత్యాగము!! బళీ! యుగంధరా? నీ కష్టసహన గుణములకు నమోవాకములు. నీ పట్టుదలకు జోహారులు.

అతఁడూరక పిచ్చిగా బజారులు తిరుగుచుండ లేదు. చెకుముకి శాస్త్రి సాహాయ్యమున పరీక్షానుసి లోఁబఱచు

కొని, తన పన్నాగమునకు సర్వసిద్ధము చేసికొనుచుండెను. తనకొడుకుతో నూరిలోని సంగతు లన్నియుఁ దెలిసికొనుచుండెను. తానట నుండియు నేకశిలా నగరమునుండి నిత్యము వార్తలు తెప్పించుకొనుచు, నక్కడనుండి, యెవ రెప్పు డేరీతిగ గావలయునో తెలుపుచుండెను. అతఁడు పిచ్చి వాఁడా! 'ఢిల్లీసుల్తాన్ పట్టుకపోతాన్ - ఆరేనెల్లకు పట్టుక పోతాన్' అని ప్రారంభించి, క్రమముగ అయిదు-నాలుగు-మూఁడు నెల లని లెక్కించి చెప్పుచునే యుండెను. తన్నర్థము జేసికొన లేక, వెఱ్ఱివాఁడని నమ్మిన ఢిల్లీపౌరులును, రాజకీయోద్యోగులును వెఱ్ఱివారు. కాని, యుగంధరుఁడు వెఱ్ఱివాఁడు కాఁడు.

ఆఱుమాసములు గడచిపోయెను. ఆమాయానాటకమున నాందీ - ప్రస్తావనలు మొదలుగ నంకములు సర్వము నభినయింపఁ బడినవి. నిర్వహణసంధి మాత్రమే కొఱవడి యుండెను. ఒకనాఁ డున్నట్టుండి యమునానదీ మార్గమున నాలుగోడలు వచ్చి ఢిల్లీదగ్గఱ నిలిచెను. "ఇవి వ్యాపారపు నావలు. వీనినిండుగ వజ్రాలు - రత్నాలు - అమూల్యమైనవి కలవు. మేము గోదావర్తకులము. ఇంతకుముం దెన్నఁడును మేము ఢిల్లీకి రాలేదు. ప్రతాపరుద్రుఁడును యుగంధరుఁడును మాకు ముఖ్యులు. పాపము! ఆప్రతాపరుద్రుడు యుద్ధములోఁ జనిపోయినాఁ డఁట; యుగంధరుఁడును రామేశ్వ

రము యాత్రకేగి, మహాజ్వరముతో మరణించినాఁడఁట. ఈ విషయములు మాయడితి దారులు తెలుపఁగా వినియు, మారక మూవంశవృత్తిని గోల్కొండనేలయుని యెంచి ఢిల్లీకి వచ్చినాము'' అని జనులకుఁ జెల్పి, యూవర్తకులు సుల్తాను నకును, వజీరులకును, ప్రత్యేక ప్రత్యేకముగ నమూల్య రత్నాభరణములు 'నజర్' చేసి, 'మాయోడలలోని సరుకులఁ జూచి వ్యాపారము చేయుఁ'డని వారిని ప్రార్థించిరి. ఆకానుకల మూల్యము తెలుపుఁడని సుల్తాను వారిని గోర, వారు 'మా కానుకల విలువ మేము తెలుపుకొనుట యుక్తముకాదు. ఇంతటి ఢిల్లీసామ్రాజ్యపుఁ బ్రధానమున నీకానుకలకే విలువ కట్టువారు లేరా? లేకున్న మావసులను మీరేమి కొందురు? ప్రతాపరుద్రుఁడు మా నగలకెప్పటికి సరియైన వెల కట్టుచుండెను' అని పలికిరి.

అంత సుల్తాను కాయంతను సహింపలేక, తన ఖైదీయగు ప్రతాపరుద్రుని సౌదాగర్ వేషమునఁ బిలిపించి, విలువ కట్టింప సమకట్టెను. చెరుముకి శాస్త్రిబోధనమున సుల్తాను నానాఁడు హత్యచేయఁ దలఁచిన వలీఖాను, తనకు జోస్యులు చెప్పిన సిదర్శనములు సరిపోవుచున్న వన్న సంబరమున సుల్తాను మాటకుఁ దాను దాళము వేయుచుండెను. సుల్తాను వర్తకులతో, ''ఏమి? నాదగ్గఱ వెలలు, కట్టువారు లేరనుచుంటిరా? పిలిపించెద చూడుఁ''డని

ప్రతాపరుద్రుని బిలిపించెను. అతని [illegible] నిక వస్తువుల కెల్లసరియైన వెలలు కట్టెను. అందులకు వర్తకులు సంతసించిరి. ఆవర్తకులును - వస్తువులును - యుగంధరుని మాయానాటక పాత్రములే; వారు-ఓరుగంటి వర్తకులే; అవి రాజాభరణములే. ఆ సమయమున వర్తకులును, రాజును, బరస్పరము గుర్తించుకొనిరి.

సుల్తాను వర్తకులతో, 'నీక వ్యాపారపు సరుకులు చెప్పింపు'డనెను. వారు, "ప్రభూ! అవి యిక్కడికిఁ దెప్పించుట యసాధ్యము. నాలు గోడలనిండుగ నున్నవి. వాని నొడ లెక్కించుటకే రెండుమాసములు పట్టెను. తమ తెర్పించుకొన్న వస్తువులు మాసరుకులలో నేపాటివి? అత్యద్భుత దృశ్యము లెన్నియోకలవు. కావున, దయచేసి, సుల్తానువారు, సపరివారముగ సౌదాగర్లతోఁ గూడ మా యోడలకే విచ్చేసి తిలకింప వలయు"నని వేఁడికొనిరి. సుల్తాను, ప్రతాపరుద్రునితో, 'మిమ్ములను వర్తకులు నమ్మినారు. వారి యోడలలోని వస్తువు లమూల్యములై యుండును. వాని నెట్లైనను గొనఁ జేయువలయును. కావున, మీరు వాని కన్నిటికి వెలలు నున్నటుచుట్టి చెప్పవలయును. మీమాట కాదన్న వారికి శిరచ్ఛేదము చేయించెదను. ఈసహాయము చేసినట్లైన మిమ్ముఁ జెఱనుండి విముక్తులఁ జేసెదను, అని పలికి, రాజు నొప్పించి, సపరివారముగ

నాతఁడోడలఁ జూచుట కరిగెను. ఆ రాత్రి వలీఖాను తన చెల్లెలి నిచ్చి వివాహము సేయునెపమున సుల్తానునిఁ జంప నుద్యుక్తుఁడై యుండెను.

అందఱు నోడ లెక్కిరి. వెట్టివాఁడును వారి వెంటనే వచ్చియుండెడు. ఎక్కిన దాదిగా నక్కడి విచిత్రవస్తు సందర్శన సంభ్రమమునంబడి యందఱును ముగ్ధులైరి. లంగరు లెత్తఁబడి, యోడలు పయనించుచున్న సంగతి యెవరికిని దెలియలేదు. కీలుబొమ్మల నాట్యము చూచుటయందే ప్రొద్దుగ్రుంకెను. వలీఖాను రాత్రి తన పన్నుగడ నెఱవేర్చుకొనవలెనని, "ఇప్పటికి నగరమునకేఁగి రేపుమరల రావచ్చును. ఇంతకుముందు దమకుఁ దెలిపియున్న నాయింటికి విందునకు మనము శీఘ్రముగఁ బోవలయు" నని సుల్తానును హెచ్చరించెను. కాని, వర్తకులు రాత్రిభోజనమునకుఁ దన్నాహ్వానించి, యింతనజరు పెట్టుటచే వారిని జిన్నపుచ్చుట తగదని తలఁచి, వినోద దర్శనోత్సుకత నరికట్టలేక, సుల్తా నా రాత్రియందేయుండ నంగీకరించెను. వలీఖాను మాఱుమాటాడలేక, సుల్తానువెంట నందే నిలిచెను. రాత్రిభోజనము లయ్యెను. పానీయములు త్రాగిమత్తెక్కి సుల్తాను, పరివారమును బడిపోయిరి. వినోదార్థము, సుల్తాను, తెనుఁగుదేశము జయించిన కీర్తినాటకము నాడిరి. ఆ నాటక పాత్రల ద్వారమున వలీఖాను రాజును యుద్ధమునందు గెలువలేదనియు

వేఁట కేఁగినయెడ నొంటరిగ రాజునస్తులు వేసికొన్న చాఁకలి పేరిగానిని బట్టినాఁడనియుఁ దనగుట్టును దెలుపనున్న ఖుస్రూను వలీఖాను జంపించినాఁడనియు సుల్తాను దెలిసికొనెను. దాన రాజునకు వానిపై నసహ్యమును, క్రోధమును గలిగి, వలీఖానుని వెంటనే సఱక నాజ్ఞాపించెను. భటులు రాజాజ్ఞను పాలించిరి. కొంతసేపటికిఁ సుల్తాను నిద్రపోయెను. నిద్రలోనే యాతఁడు నిగళబద్ధుఁడయ్యెను. భళీ! యుగంధరా! ఏమి! నిచలము! నీ రాజును వారెట్లు నిద్రపోవునపుడు బంధించిరో, నీవును ఆ సుల్తానును నిద్రలోనే బంధించితివి. తెల్లవాఱునప్పటికి నానలు కాశీచేరెను.

ఏకశిలా నగరమునఁ దురుష్కులు పట్టుకొనిపోయిన పేరిగానిని విడిపించుకొని మహామంత్రి యుగంధరుఁడు వచ్చుచున్నాఁడనువార్త వ్యాపించెను. రాజుగారు, మహామంత్రిగారి కెదురేగుచున్నారను వ్యాజమున రాజవేషముతో నున్న పేరిగానిని బల్లకీలోఁ దీసికొనిపోయి, కొంతదూరమున నాతని విడిచిపెట్టి, రాజును, మహామంత్రియు భద్రగజములపై నెక్కి మహావైభవమున మంగళవాద్యఘోషములతోఁ బురప్రవేశ మొనర్చిరి. యుగంధరుఁడు తాను జేసిన శపథము ప్రకారము – ఆఱు నెలలకుఁ బ్రతాపరుద్రదేవ చక్రవర్తిని విడిపించి తెచ్చి, రాజమాత మనస్సునకు శాంతింగూర్చెను.

బాపురే! యుగంధరా! నీవు మా యాంధ్రదేశ మాతకుఁ జేసినసేవకుఁ, బ్రదర్శించిన ప్రజ్ఞకు, నీ ఋణము తీర్చుకోలేము. ఆంధ్రలోకమంతయు నీకు నిత్యము దీపము పెట్టి మ్రొక్కవలయును. నాఁటికి నేఁటికి నీవంటివారు పుట్టరైరి! మంత్రిత్రయమున నీవే నాయకమణివి. ఆంధ్రదేశ మాత నీయట్టి మణులఁ బ్రసాదించుఁ గాక!

# తిమ్మరుసు

ఆంధ్రదేశ చరిత్రలో విజయనగర సామ్రాజ్యము సువర్ణాక్షరములఁ జెక్కఁబడినది. శరీరమునకు గుండెకాయ వలె – నిటు లూర్ధ్వమునకు, నటు లధోభాగమునకు, దుష్ట రక్తమును శుభ్రపఱచి, విశుద్ధరక్త ప్రసారమును గల్గఁజేసి, కాంతివంతము, చైతన్యవంతమును జేయఁగల్గిన దీవిజయ నగరసామ్రాజ్యము. రాజకీయ రంగమునందును, కళారంగమునందును, సాహిత్యరంగమునందును, నేకకాలముననే విజయనగర సామ్రాజ్యనటితన పాత్రపోషణమును బ్రతిభావంతముగ నిర్వహింపఁ గల్గినది. నాఁటిశిల్పములు, నాఁటియానకట్టలు, నాఁటికావ్యములు, నాఁటివైభవమునకు నేఁటికిని బ్రత్యక్ష ప్రమాణములై మనల నాశ్చర్యముగ్ధులఁ జేయుచున్నవి. ఆనాఁడు స్వయముగ సందర్శించి, హర్షించి, పొగడిన దేశాంతరుల వ్రాఁతలు, నాఁటికావ్యములలోని వర్ణనములుత్ప్రేక్షాతిశయోక్తులే యన్న యనుమానమును దూరము చేయుచున్నవి. సుమారైదు శతాబ్దులు గడచినను నేఁటికిని చెక్కుచెదరని నాఁటికళా విలసనలేశము లా సామ్రాజ్య మహోన్నతస్థితిని బ్రతిభారతీయుని స్మృతిపథమున మెఱపు వలె మెఱపించి, తచ్చ్యుతికిఁ గన్నులు చెమ్మగిల్లఁ జేయుచున్నవి.

అట్టి విజయనగర సామ్రాజ్యమునకు మూలకందము తిమ్మరుసు మహామంత్రి. విజయనగర రాజుల కాధారభూతుఁగాఁ గాసి. తన నీతినిపుణతతో - బుద్ధిచాతుర్యముతోఁ గార్యములు నిర్వహించి 'ఆంధ్రసామ్రాజ్యస్థాపకుఁడు - భారతధర్మసంరక్షకుఁడు' నని పేరు గాంచిన తిమ్మరుసు మహామాత్యుఁడు నిత్యస్మరణీయుఁడు.

సామాన్యముగ మహాత్ములందఱుఁ జిన్నతనమున దారిద్ర్యమును, గష్టములను ననుభవించినవారే. ఏయండయు లేక, యక్కడఁబడి, యిక్కడఁబడి, యనేకావస్థల పాలై, యాత్మప్రతిభతో నాధిక్యము వడసినవారే పెరిఁగి, పెద్దవారైన తరువాత లోకానుభవము కలిగి, యనేకుల యాదరణకుఁ బాత్రులు కాఁబోవుదురు కాఁబోలు! తాము స్వయముగఁ గష్టములు పడినవారే, పరులకష్టముల నర్థము చేసికొనఁ జాలుదురు. అగర్భశ్రీమంతుల కాఁకటితో నకనకలాడు నకించనుల యవస్థ లెట్లనుభవవేద్యము లగును! అందులకే యనుభవజ్ఞులైన యమాత్యుల యాజ్ఞాబద్ధులైన యధిపుల సామ్రాజ్యములే యౌన్నత్యమునందఁ గల్గినవి; అట్లుకానివి, యతిశీఘ్రకాలములోనే యస్తమించినవి. అట్లే - విజయనగర సామ్రాజ్యోన్నతికిని దిమ్మరుసు మహామాత్యుని లోకానుభవము మూలము. ఆలోకానుభవమునకు నతని చిన్ననాఁటి యవస్థాపరంపరయే హేతువు

తిమ్మరుసుది బ్రాహ్మణవంశము. క్షత్రియవంశమని కొందఱూహించిరి. అట్లూహించుట కవకాశము లేక పోలేదు. ఇతనిపేరు తిమ్మనయే. పేరిచివర నతుకంబడిన 'అరుసు' శబ్దము 'రాజు' శబ్దమునకుఁ గర్ణాటకమునఁ బర్యాయపదము. ఇతని పినతండ్రి యొకఁడు తిమ్మరాజు కూడ నుండెను. అంతమాత్రముననే క్షత్రియుఁ డనుకొనరాదు. సామాన్యముగ క్షత్రియులు మంత్రిపదవియందుండినదిలేదు. బ్రాహ్మణులలోను రాచకార్యములు చేయు లౌకిక నియోగుల పేరునకు "వీరరాజు-పేరరాజు" అని రాజుశబ్దముండుట యానాఁటికిని నేఁటికిని ప్రసిద్ధమే. మఱియు, మాదయగారి మల్లనచేత 'అఱువేలవంశ వార్ధిపూర్ణచంద్రమా' అనియు, నొక శాసనమునందు 'సాళ్వతిమ్మనృపతిః ప్రాదాద్ద్విజన్మాగ్రణీః' అనియు నొడువఁబడియుండుటచేతను నితఁడు బ్రాహ్మణుఁడనుటకే సందియము లేదు. వీరిది సాళువవంశము. కౌండిన్యస గోత్రము. ఇతని పితామహుఁడు వేమరాజు, తండ్రి రాచిరాజు. ఇతని తాతతండ్రులు కూడ సాళువవంశీయులైన రాజులకడ మంత్రులుగ నుండిరి. మల్లికార్జున రాయలకాలమునఁ గొండవీడు—నుదయగిరి రాజ్యములను గజపతులాక్రమింపఁగా, రాచిరాజు తన యైశ్వర్యము నంతయుఁ గోల్పోయి, కుటుంబయుక్తముగఁ జంద్రగిరి రాజ్యమునకు వలసపోయెను. అచ్చటనే క్రీ. శ. 1460 సం. ప్రాంతమునఁ దిమ్మరుసు జన్మిం

చెను. ఈతనికి గోవింద రాజను సోదరుఁడును, కృష్ణమాంబ యను సోదరియు నుండిరి. సోదరిని సాళ్వ-నరసింహరాజు నొద్దఁ బ్రధానామాత్యుఁ డైన, నాదిండ్ల-చిట్టి గంగన్న కిచ్చియుండిరి. బాల్యమునందే తల్లిదండ్రులఁ గఱవుచేసి కొన్న తిమ్మన గోవిందు లిరువురును దనువుసంధ్యలు లేక కొంతకాలము స్వేచ్ఛగాఁ దిరుగుచుండిరి.

ఒకనాఁడు తిమ్మన యెండప్రొద్దున నాఁకట నలసి, యొక్కడనో యొక చెట్టుక్రింద నిద్రించుచుండ, నొక కృష్ణ సర్పము తన పడగనువిప్పి, యతనికి నీడ పట్టుచుండెనఁట. అది యొక సిద్ధుఁడుచూచి, యాతని లేపి, 'నీవు మహాత్ముఁడ వగుదు'వని చెప్పి పోయెనఁట. నాఁటినుండి యతనికి మనః పరివర్తనము కలిగెను. దాననిఁకఁ గాలము వ్యర్థపుచ్చక, విద్యాభ్యాసము చేయవలెనని బుద్ధి పుట్టెను. అన్నదమ్ము లిరువురు నుపాధ్యాయుల నాశ్రయించి, వ్రాఁత, చదువు, గణితము, నేర్చుకొనుట యేగాక, సంస్కృతాంధ్రముల యందుఁ జక్కని పాండిత్యమును గడించిరి. తిమ్మన సోదరుని కంటె బుద్ధిసూక్ష్మత గలవాఁడు. వస్తుతత్త్వమును, మనుష్య స్వభావమును, బాగుగఁ బరిశీలించువాఁడు. శరీర వ్యాయామమొనర్చి, యుద్ధసాధనములందు బాగుగఁ బరి శ్రమ చేయుచుండెను. "తియ్యని వింటికాఁడ వయ్యా తిమ్మరు సయ్యా" అను వాక్యమును బట్టి సురూపము గలవాఁ

డనియుఁ దెలియుచున్నవి. పదపడి, పండితులకడఁ జేరి, వినయ విధేయతలతో మెలఁగుచు, శుశ్రూషించి, యప్పటికిఁ జుట్టుపట్టుల నీరలే మేధాశక్తి-బుద్ధి కౌశలము - శాస్త్ర వైదగ్ధ్యము కలవారని పేరు బ్రోసి యుండిరి. వీరి యీ ప్రశస్తి చిట్టిగంగనామాత్యు నాకర్షించెను. అతఁడు వీరి నవ్వురినిఁ జేరఁదీసి, విశేషముగఁ దిమ్మన నాదరించుచుఁ, దనదివాణమున లేకరులుగా నియమించెను. వారు తమ విధిని సక్రమముగ నిర్వర్తించుచు నైయధికారుల మన్ననలకుఁ బాత్రు లగుచుండుటకు గంగనామాత్యుఁడు గడుంగడు నలరి. తిమ్మనకుఁ దానే స్వయముగ రాజనీతి-రాజ్యాంగతంత్ర-మంత్రనిర్వహణము లాదిగ సర్వశాస్త్రము సమగ్రముగ బోధించెను. కౌటిలీయార్థశాస్త్రము - కామందకుని నీతి శాస్త్రములందలి రహస్యములు తిమ్మనకుఁ గరతలామలకము లయ్యెను. చిట్టిగంగన తాను వృద్ధుఁడై నందున "హైందవ ధర్మరక్షణార్థమై స్థాపితమైన యీసామ్రాజ్యమును నాశము నొందకుండఁ జూచుకొమ్ము. నీ వానర్చ వలసిన విధ్యుక్త ధర్మ మిదియే యని యెఱుంగుము. ఏ బొందిలోఁ బ్రాణమున్నంతవఱకు దీనిని మఱవకుము." అని తిమ్మనకు నుపదేశించెను.

తిమ్మయ పౌత్త్రుఁడును-ఈశ్వరరాజు పుత్త్రుఁడును నగు తుళువ నరసరాజు మన తిమ్మరుసు యొక్క ప్రతిభా

విశేషము విని, చిట్టిగంగనామాత్యుని ప్రేరేపణమునఁ దన యొద్ద నాతనిని ముఖ్యమంత్రిగ నియమించుకొనెను. ఆకాలమునఁ గర్ణాటక సామ్రాజ్యమును బరిపాలించుచున్న విరూపాక్షరాయలు భోగలాలసుఁడును, దుర్వ్యసనాసక్తుఁడునై, జనకంటకుఁడుగ నుండెను. అదే సమయము మంచియద సని సామంతరాజు లెల్లరు కప్పము కట్టుట మాని, యెవరంతకు వారు స్వాతంత్ర్యము ప్రకటించుకొనిరి. పశ్చిమసముద్ర మందలి రేవు లన్నియుఁ బరాధీనము లయ్యెను. కృష్ణాతుంగ భద్రల మధ్యదేశ మంతయుఁ దురుష్కు లాక్రమించు కొనిరి. దీని నంతయుఁ జూచి సహింపఁ జాలక, విరూపాక్షుని పెద్దకొడుకుఁ దనతండ్రినిఁ దనచేతులతోఁ జంపెను. ఆ మీఁద వాని తమ్ముఁడు వానిని జంపి రాజయ్యెను. ఈ రాజకీయ విప్లవమును గాంచి, బహమనీ సుల్తాను తానొక్క ప్రక్క నీసామ్రాజ్యమును మ్రింగఁ జూచుచుండెను.

అట్టితఱి - తిమ్మరుసు - చిట్టిగంగన యుపదేశమును మననము చేయుచుండినవాఁడు కావున, హైందవ సామ్రాజ్యము నశించిపోవుననియు, నార్యధర్మములు తలక్రిందు లౌననియు, దీర్ఘముగ నాలోచించి, "పూర్వము వేనునిఁ బ్రజలు పదభ్రష్టుఁ జేసినట్లు-మనము నీకర్ణాటప్రభునిఁ దొలఁగించి, సాళ్వనరసింహ భూపాలుని సార్వభౌమునిగ నొనర్చుట లెస్స' యని నరసరాజునకు బోధించెను. అతఁ

డును దాని కంగీకరించి నరసింహ భూపాలునికి సందేశ మంపెను. నరసింహ రాజా సందేశమువిని, విద్యానగరము పై దండయాత్ర కాయత్తమై వెడలుటకుఁ దనసైన్యాధ్యక్షుఁడైన తుళువ-నరసరాజున కాజ్ఞాపత్ర మంపెను.

నరసరాజును, దిమ్మరుసు సలహా ననుసరించి, యున్నట్టుండి, యుద్వృత్తుగ సమస్త సైన్యముతో విద్యానగరము పై దాడివెడలి ముట్టడించెను. విద్యానగరపు దండనాయకులకుఁ దాము వచ్చిన ప్రయోజనమును గూర్చి తెలిపెను. అనేకులకుఁ గానుక లర్పించెను. పురముఁ దమ్మడ్డగించు వారు లేనట్లు సామదానభేదములతోఁ జక్కఁబఱచు కొనెను. పురమునకుఁ, బ్రజలకు, నించుకంతయు నష్టము కలిగింపక సేనలతోఁ గూడఁబుర వీథుల నూరేగి, రాజభవనమును సమీపించెను. అప్పటి కారాజు నంతఃపురములో భోగలాలసుఁడై యుండెను. ఇఁకఁ దనదగ్గఱకు శత్రువులు వత్తురన్నప్పు డాతఁడు భయపడి, ప్రాణరక్షణార్థము దిడ్డి కంతఁ బడి మందిరమును, నగరమును విడిచి, పాఱిపోయెను. నరసరాయఁడట్లు శ్రమ లేక విద్యానగరమును స్వాధీన పఱచుకొని, సాళ్వ-నరసింహరాయనికి వర్తమాన మంపెను. అతఁడు వచ్చి, క్రీ. శ. 1486-87. సం. లోఁ గర్ణాట సామ్రాజ్య సార్వభౌముఁ డయ్యెను. సామంతులు, ప్రజలు నాతని రాచఱికమున కామోదించిరి. తిమ్మరుసు తుళువ-

నరసరాజునకు మంత్రి యను పేరే కాని, విద్యానగరమున నుండి, యాతఁడే రాజకార్యములను నెఱవేర్చుచుండెను.

కొంతకాలమునకు సాళ్వ - నరసింహరాయఁడు స్వర్గస్థుఁ డయ్యెను. అతని పెద్దకుమారుఁడగు తిమ్మ రాయనిఁ బట్టాభిషిక్తుని గావించి, తుళువ-నరసరాజే తిమ్మ రుసు సాహాయ్యమున విద్యానగర సామ్రాజ్యచక్రము నవక్రముగఁ ద్రిప్పుచుండెను. అది చూచి యోర్వఁజాలక, యొకదళవాయి, బాలప్రభువును రహస్యముగఁ జంపించి, నరసరాజున కపవాదు కల్పించెను. అప్పుడు తిమ్మరుసు నరసింహుని ద్వితీయపుత్త్రుని-ఇమ్మడి-నరసింహరాయఁడను పేర సింహాసన మెక్కించి, యా యపవాదును బోఁగొట్టెను. కాని, యాదళవాయి నరసరాజుపై ద్వేషము విడువక, యాబాలరాజు స్నేహము సంపాదించి, నరసరాజును సాగ నంపుటకై ప్రయత్నము చేయుచుండెను. అది తిమ్మరుసు గ్రహించి, యాబాలునకు హితబోధ చేసెను; కాని, యది ప్రయోజనకారి కాలేదు. ఆపై వేఱొక తంత్రము పన్న వలసి వచ్చెను. తిమ్మరుసు నరసరాజును వెంటఁబెట్టుకొని, కారణాంతరమునఁ బోయినట్లు పెనుగొండకుఁ బోయి, యచ్చట సైన్యమును గూర్చుకొని రహస్యముగ విద్యానగరమునకు వచ్చి, ముట్టడివేసి, "మీ యన్నను జంపించిన దళవాయిని జంపింతువా? లేక, రాజ్యమును విడిచెదవా?"

అని యీ బాలరాజునకు సందేశ మంపించెను. అందులకా బాలప్రభువు భయపడి, వశవాయి శిరమును నతికించి తిమ్మరుసు నెదుటఁ బెట్టించెను. అంతట ముట్టడి చాలించి, బాలుని మన్నించెను. అంతే కాక, యిమ్మడి - నరసింహ రాయనిఁ గొంత సైన్యముతోఁ బెనుగొండలో నుంచి, తుళువ - నరసరాజే తిమ్మరుసు సాహాయ్యమున రాజ్యమును బరిపాలించుచుండెను.

విజాపురము సుల్తాను ఆదిల్ షాహాకుఁ బ్రత్యర్థియైన కాశిం బరీదు, తనకు సహాయము నిమ్మని నరసరాజును బ్రార్థించెను. ఆ సమయమునఁ గృష్ణా తుంగభద్రల నడుమ నుండు ముదిగల్లు - రాయచూరు దుర్గములను నరసరాజుచేఁ దిమ్మరుసు గెలిపించెను. సాళువ - నరసింహుని కాలము నందే మహా మండలేశ్వరుఁడైన కోనేరి నాథుఁడు తిరుచినాపల్లి మండలమునకుఁ బరిపాలకుఁడుగా నియమింపఁ బడి యుండెను. అతఁడు శైవుఁడై నందున శ్రీరంగ దేవాలయమునందలి వైష్ణవ ధర్మకర్తల నానావిధముల బాధించుచుండెను. ఆ వార్త తిమ్మరుసు విని, వాని నడఁచుటకు నరసరాజును బ్రేరేపించి, నాగమ నాయని మఱికొందఱను బంపి, కోనేరి నాథుని గర్వమడపించి, ప్రజలయభిమానమును జూఱఁ గొనునట్లు చేసెను. విజయనగర ప్రాకార దుర్గములబలపఱచి, శత్రువుల కభేద్యములుగఁ జేయించెను.

తిమ్మరుసు జీవితమున నిది పూర్వభాగమని చెప్ప వచ్చును. కృష్ణదేవరాయల జననమునుండి యుత్తరభాగ మారంభ మయినది. ఈ తొలి ఘట్టమున కంటె రెండవ ఘట్టమే-తిమ్మరుసు ప్రతిభా వికాసమునకు, నఘటన ఘటనా సామర్థ్య ప్రదర్శనమునకు, నతనికీర్తి ప్రతిష్ఠల సంపాదన మునకు, ముఖ్యముగ నాంధ్రదేశ చరిత్రకే ప్రాముఖ్యము వహించిన దని నొక్కి వక్కాణింప వచ్చును. పూర్వరంగ మునఁ జెట్టి గంగనామాత్యుని యుపదేశములును, దిమ్మ రుసు మనస్సునంగల యున్నతాశయములును, ఆంధ్ర సామ్రాజ్యలక్ష్మి కలవరింప వలసిన యమూల్యావసరములు నెన్నియో కొఱవడి యుండెను. అందులకు హేతువు సమర్థుఁ డయిన ప్రభువు దొరకకుండుటయే. ఆ కొఱఁతల నన్నిటిని దిమ్మరు సుత్తరరంగమునఁ బూరింపఁ గలిగెను. రాజ్యము నకు - రాజు, మంత్రి యనువా రిద్దఱును రెండుపక్షములు. ఏ యొక్క పక్షము మాత్రము బలవత్తరమై యున్నను సం పూర్ణాదర్శముల సాధింప వలను కాకుండును. అదియుఁ గాక, పరిపక్వదశకు సాధన సంపత్తి యంతయు సమగ్రముగ సమకూరి యున్నను, సరియైన సమయము సయితము సంద ర్శింప వలయును. తిమ్మరుసునకు నా సమయము కృష్ణరా యల రూపమున నావిర్భవించెను.

తుళువ - నరసరాయలకుఁ దిప్పాంబయందు వీర నరసింహ దేవరాయలును, నాగాంబయందుఁ గృష్ణదేవ

రాయలును, ఓ బాంబికయందు - అచ్యుత రాయఁడు - రంగరాయఁడు ననువారును, జన్మించిరి. "పుట్టంగనే తెలియును బూఁబిందె లక్షణ" మన్నట్లు కృష్ణ దేవరాయల యందు భావి శుభసూచనలు కన్పట్టుచుండెను. ఆ ముఖవర్చస్సు - ఆ విశాల ఫాలము - ఆ యాకర్ణాంతములైన యరుణరేఖా వికాసనయనములు-ఆ విస్తృతవక్షము- ఆ యాజానుబాహుసంపద - ఆ బుద్ధికుశలత - ఆ భావగాంభీర్యము మొదలగు సాముద్రికములు గనుఁగొని, చిన్ననాఁడే యితఁడు నా యాశయ పూరణమున కనువైనవాఁడగునని తిమ్మరుసు నిశ్చయించుకొనెను. ఈ విషయము తెవరికిని నర్థము కాలేదు; తిమ్మరుసు వెల్లడింపను లేదు. కృష్ణరాయని పోషణమునందు మాత్రము మహామంత్రి తిమ్మరు సొడలెల్లఁ గన్నులు గలిగి యుండెను. ఆ మంత్రి వైఖరిచూచి తిప్పాంబిక, 'కృష్ణరాయనిఁ మదిముట్టించిననే గాని, నా కుమారునకు రాజ్యప్రాప్తి లే'దని తలంచి, వానికి విషప్రయోగము మొదలగు దుష్ప్రయత్నము లెన్నన్ని యో చేయించెను. అంతఃపురమునఁ దుమ్మినతుమ్ము - దగ్గినదగ్గు. నప్పటి కప్పుడు కనుగొనుచున్న తిమ్మరుసు, శ్రీ కృష్ణుని నాయాపదలవలనఁ గాపాడి, తనయింటియందే యుంచుకొని, విద్యాబుద్ధులు గఱపుచుండెను. కృష్ణునకుఁ దిమ్మరు సన్నఁ జంద్రికంటె నెక్కుడు భక్తి. అతని 'నప్పాజీ' యనియే పిలుచుచుండెను. ఆయన మాటయే వేదవాక్యము. తన్నం

తో ప్రేమించుచున్నను నాయన యనిన సింహాస్వప్నము.
ఇట్లు కృష్ణదేవరాయలు నయము - భయము కలిగి, పదు నెనిమిదేండ్ల ప్రాయము వచ్చునప్పటికిఁ దిమ్మరుసు వలన సంస్కృతాంధ్ర కర్ణాట భాషలయందుఁ జక్కని పాండిత్యమునుగడించి, సాము గరడీలు నేర్చి, యశ్వారోహణ దక్షత, ధనుర్వేద నిపుణతఁ గలిగియుండెను. రాజనీతి - దండనీతి మొదలగు రాజ్యాంగతంత్రములతనిచే స్వయముగ బోధింపఁబడి, యాతఁడు సకలకళాపరిపూర్ణుఁ డయ్యెను. చదువునకుం దగిన సౌశీల్యమాతనియందమరి, ప్రజారంజకుఁడై. ప్రవర్తించుచుండెను. క్రీ. శ. 1505-వ వత్సరమునఁ దనపుత్త్రుల మంత్రియగు తిమ్మరుసు చేతిలోఁ బెట్టి, తుళువ - నరసరాజు దివంగతుఁ డయ్యెను. అంత వీరనరసింహరాయఁడు సింహాసన మాక్రమించెను. కాని, యాతని రాచఱికము సక్రమముగ సాగలేదు. సామ్రాజ్యమునఁ గల్లోలములు చెలరేఁగెను. మహామాత్యుని మంత్రము ననుసరించి, వీరనరసింహుఁడు తీర్థయాత్ర మిషతో, దక్షిణ దిగ్విజయ యాత్ర జయప్రదముగ నెఱవేర్చెను. కృష్ణదేవరాయలును, వీరనరసింహుని యానతిని, దిమ్మరుసు ననుమతినిఁ దలఁదాల్చి. సైన్యసమేతుఁడై, విజయయాత్రకు బయల్వెడలెను. దాని ఫలితముగ- ఉమ్మత్తూరు. శివసముద్రము, శ్రీరంగపట్టణము మొదలగు దుర్గములు వశమయ్యెను. కప్పముక్రిందఁ గోటిద్రవ్యము బొక్కసమునకుఁ జేర్చెను. కల్లోలములు శాంతించెను. వీర

నరసింహుఁడును సంపాదించిన దేశమును జక్కఁ బఱచు కొని సామ్రాజ్యమును స్థిరపఱచు కొనుటయందు నిమ గ్నుఁడై, గజపతుల - అశ్వపతుల జోలికిఁ బోక, జాడ్య గ్రస్తుఁడై యవసానదశయం దుండెను. అప్పుడాతఁడు తిమ్మ రుసుతో, "అనూనశ్యవర్యా! మీరు నా యనంతరము నా కుమారుఁడగు తిరుమలదేవరాయలనే సింహాసన మెక్కింపవలయును. ఊరక తలయూఁచినఁ జాలదు. కృష్ణ దేవరాయల కన్నులు పెఱికించి నాకుఁ జూపినఁగాని, నా ప్రాణములు సుఖముగఁ బోవు. నా మీఁద భక్తి కలదేని యట్లు చేయుఁడు" అని యాజ్ఞాపించెను.

ఇప్పుడు తిమ్మరుసునకుఁ గ్లిష్టసమస్య యేర్పడెను. బ్రదికినంత కాలము రాజునకు విధేయుఁడై యవసాన కాలమున నాతనికోర్కి చెల్లింప నిరాకరించి రాజద్రోహా రము సేయవలయునా? లేక-చిన్ననాఁటనుండి తన పుత్త్రుని కంటె నెక్కుడుగఁ బ్రేమించి, తన యాశయముల నాతని వలన నెఱవేర్ప వలయునని కొండంత యాశ పెట్టుకొన్న కృష్ణదేవరాయని కన్నులు పెఱికించి యాతని జీవితము బుగ్గిచేసి, తన మనసును తానే చంపుకొన వలయునా? రెంటికిని బాధ లేకుండ నొకయుక్తి పన్నెను. కృష్ణుని కీ వార్త నెఱిఁగించి యాతనిఁ దనయింట సంగుప్తపఱచి, మేఁక కన్నులు పెఱికించి తెచ్చి, మరణశయ్యపై నున్న రాజు

నకుఁ జూపించెను. అవి కృష్ణరాయల కన్నులే యనుకొని వీరనరసింహుఁడు తృప్తిగఁ బ్రాణములు విడిచెను. అతని మరణానంతరము శ్రీకృష్ణదేవరాయలను జక్రవర్తిగాఁ బ్రకటించెను.

తిమ్మరుసు, క్రీ. శ. 1509 సం. ఫిబ్రవరి 4 వ తేది శ్రీకృష్ణరాయ పట్టాభిషేక మహోత్సవ మతివైభవముగఁ జరిపెను. సామంతరాజు లనేకులు స్వయముగ వచ్చి సందర్శించిరి; కొందఱు పెక్కు-కానుక లంపిరి. ఆతని రాచఱికము సర్వజన సమ్మతమై యుండెను. ఆ తరువాత వీరనరసింహరాయుని పుత్త్రుఁడైన తిరుమలరాయని, నచ్యుతరాయనిఁ జంద్రగిరి దుర్గమున నుంచి, వారి రక్షణమునకుఁ గొంతసైన్యమును, జీవనార్థము కొంతరాఁబడియుఁ, గృష్ణరాయలచేఁ గల్పించి, యాతనిని జనస్తుతికిఁ బాత్రము గావించెను. అంత శ్రీరంగపట్టణాధీశుఁ డయిన వీరశ్యాముని పుత్త్రిక యగు తిరుమలాంబను, జిన్నాంబను నాతనికిఁ బరిణయము చేసెను. నాఁటినుండి రాజరక్షణమునం దప్రమత్తుఁడై తిమ్మరుసు మెలఁగుచుండెను. శత్రురాజుల బోధనలకు, లంచములకుఁ బెద్దసామంతులు లోఁబడి రాయలపైఁ గుట్రచేయఁ బూనిన సంగతి మంత్రి కనిపెట్టి, వారినిఁ దొలఁగించి, యాస్థానముల విశ్వాసపాత్రులయిన చిన్నవారి నుంపించెను. సామంతుల రక్షణలోనున్న కొంతభాగము

సైన్యమును రాయల పాలనక్రిందికిఁ దీసికొని వచ్చెను. ముప్పది యాఱు వేల గుఱ్ఱపుదళమును, నెనిమిదివందల యేనుఁగులును స్వయముగా రాయఁడు పోషించునట్లు చేసెను. విజయదశమినాఁడు రాయఁడు సైన్యమును స్వయముగఁ బరిశీలించి, బహుమానము లిచ్చునట్లు నేర్పాట్లు కావించెను. పట్టాభిషేక మైనతరువాత రెండు సంవత్సరములు కోట బలపఱచుకొనుట యందును, సైన్య సమీకరణమునందును వినియోగించెను.

రాయ లీ రెండు సంవత్సరములందును విద్యాకవితా గోష్ఠి జరుపుచుండెను. అందులకును దిమ్మరసు భాషాపక్షపాతమును గవితాభిరుచియుఁ బ్రధానకారణములు. తిమ్మరసు పాండిత్యమునకు నగస్త్యేశ్వర విరచితమైన సంస్కృత బాలభారతమునకు నితఁడుచేసిన వ్యాఖ్యయే గొప్పనిదర్శనము. పెద్దన, తిమ్మనాది కవులు కవితాగోష్ఠికిని, బొడ్డుచర్ల - తిమ్మన చతురంగగోష్ఠికిని, రాయలకు జతపడుటకుఁ దిమ్మరసు ప్రభావమే ప్రధానము.

ఈ రెండు సంవత్సరముల కాలములోఁ దిమ్మరసు బొక్కసము వృద్ధిగావించి, సైన్యము సాయత్తము చేసికొని పూర్వదిగ్విజయ యాత్రకు రాయనిఁ బ్రోత్సహించెను. తానే సర్వసైన్యాధ్యక్షపట్టము వహించెను. తాము నగరమున లేని తఱిఁ దనయన్న గోవిందరాజును నగరరక్షకుఁడుగా నియ

మించి, యాతనికి లక్షసైన్యమును సహాయముగా నొసంగెను. దండువిడలు సైన్యమును యేడు విభాగములు కావించెను. ఒక్కొక్క విభాగమునకు ముప్పదివేల కాల్బలము, నాలుగువేల గుఱ్ఱపుదళము, నిన్నూఱేనుఁగులు నుండునట్లు నియమించెను. ఆయేడు భాగములకుఁ దమకు విశ్వాసపాత్రులైన సామంతుల నధ్యక్షులుగాఁ జేసెను. ఇట్లు సకల సైన్యసమేతుఁడై రాయలతోఁగూడి 1513-వ సంవత్సరమున, నొక శుభముహూర్తమునఁ, బూర్వదిగ్విజయ యాత్రకుఁ దిమ్మరుసు వెడలెను. వెంటఁ గవులు - పురోహితులు - గురుజనములు - విద్వద్వరేణ్యులు-నరిగిరి. వారి విజయ యాత్రకు నుదయగిరి ప్రథమాహుతి యయ్యెను.

అది ప్రతాపరుద్ర గజపతి స్వాధీనములోనిది. గజపతి పినతండ్రి తిరుమల కాంతరాయఁడు పదివేల కాల్బలము, నాల్గువందల గుఱ్ఱపుదళమును, దుర్గములోనికిఁ జేర్చుకొని, దుర్గమును సంరక్షించుచుండెను. ఆ దుర్గమున కొక చిన్న త్రోవ తప్ప వేఱుమార్గములు లేవు. రాయలు - తిమ్మరుసు కోటను ముట్టడించిరి. అంతలో గజపతి లక్షసైన్యము పంపెను. కాని, యంతకు ముందే శత్రుసైన్యము ముట్టడించియున్నందున లోని వారి కది యుపయోగపడలేదు. తిమ్మరుసు, రాయలను, రాయసము కొండమరుసయ్యను, వాని సైన్యమును దుర్గమును బట్టికొమ్మని నియమించి,

తక్కిన సైన్యముతో గజపతిసైన్యము నెదుర్కొని ఘోర యుద్ధము నొనర్చుచుండెను. కొండమరుసయ్య పదునెనిమిది నెలలు ముట్టడించినను దుర్గము స్వాధీనము కాలేదు. తుదకుఁ గొండలు పగులఁగొట్టి బాటల నేర్పఱచి, లోనికిఁ బోయి, శత్రుభటుల సంహరించి, దుర్గమును స్వాధీనము చేసికొనెను. దానికి రాయలు సంతసించి, కొండ మరుసయ్యను ఏకధురంధర ధౌరేయునిగా నియమించి, యాతనికిఁ గొంతసైన్యము సహాయముగనిచ్చి, తాను దక్కిన సైన్యముతోఁ దిమ్మరుసును గలిసికొనఁ బోయెను. ఉదయగిరి ముట్టడి మొదలు, రాయల సైన్యములకు, గజపతి సైన్యములకు యుద్ధము రెండు సంవత్సరములు జరిగెను. తిమ్మరుసు సైన్యము ముందునకుఁ బోవుకొలఁది, గజపతిసైన్యములు వెనుకకుఁ దొలఁగుచుండెను. కొండవీటి వీరభద్ర గజపతి తన సేనలతో రాయలసైన్యమును దాకి, నిలువంజాలక, కోటలోనికిఁ బాఱిపోయి, దాఁగుకొనెను. తిమ్మరుసు గజపతిసైన్యములను దఱుముచుఁ బోయి, యద్దంకి - వినుకొండ - బెల్లముకొండ - నాగార్జునకొండ - తంగేడు - కేతవరము మొదలగు వానిని జయించెను. క్రీ. శ. 1515-వ వత్సరమునఁ దిమ్మరుసు కొండవీటిని ముట్టడించెను. వెనుక నుండి వచ్చుచున్న గజపతిసైన్యము నెదిరించుటకై రాయలఁ బంపెను. రాయలు తక్కిన సేనలతోఁ గృష్ణానదీ ప్రాంతమున గజపతిసైన్యమును మార్కొని తీవ్రముగఁ బోరెను.

రాయలు కృష్ణను దాఁటి, గజపతి నోడించి, తఱిమెను. తిమ్మరుసు రెండు మాసములకుఁ బైగా ముట్టడి చేసి, క్రీ. శ. 1515 జూన్ నెలలోఁ గొండవీటిని స్వాధీనపఱచుకొని, వీరభద్రుఁడు, నతని సామంతులను జెఱఁగొనెను. చెఱఁగొన్నవారు విజయనగరమున కంపఁబడిరి. కొండవీటికిఁ దిమ్మరుసు మేనల్లుఁడు - నాదిండ్ల - అప్పామాత్యుఁడు - పరిపాలకుఁడుగా నియమింపఁబడెను.

రాయ లంతటితో నాఁగక, యింకను ముందునకు నడచి, రాజమహేంద్రవరము - మన్నెసంస్థానములు - పొట్నూరు - జయించెను. పొట్నూరికడ జయస్తంభ మొకటి ప్రతిష్ఠింపఁబడెను. ఒడ్డాది మసి యొనర్చి, సింహాచలస్వామిని సందర్శించి, రాయలసైన్యము కొంత విశ్రాంతి తీసికొనియెను. అంతతో గజపతిసైన్యములు కంటికిఁ గానరాకుండఁ బలాయన మయ్యెను. దానితోనైనను రాయలకు సంతృప్తి కలుగలేదు. తిమ్మరుసు వలదనుచున్నను గజపతి నివాసమగు కటకపురికి సైన్యము నడిపించెను.

గజపతి సామంతులు పదునాఱుగురు పాత్రులును దమ సైన్యములతో రాయలసైన్యము నెదిరించి, పోరఁ దొడఁగిరి. అది యరణ్యమయ ప్రదేశము - మీఁదు మిక్కిలి రాయలసైనికు లాయాసగ్రస్తులు. దీనికిఁ దోడు రోగములు కల్గి చాల నష్టమై రాయల విజయేచ్ఛ సంశయా

స్పదమయ్యెను. అత్తఱి రాయలు తిమ్మరుసుతో, "మీ మాటవినమికిది ప్రాయశ్చిత్తము. నన్ను క్షమింపుఁడు. ఇత్తఱి మనగతి యాలోచింపుఁడ"ని నుడివెను. అందులకు మంత్రియు, "విచారపడకుము. ఇంతకాఁగలదని నేమున్నే నిశ్చయించితిని. ఇప్పుడు కేవలము యుక్తిచేతనే మనము సాధింపవలయును. నీవ్యూరక చూచుచుండుము. నీక్లిష్ట సమస్య నెంతసులభతరముగ నివారింపఁ దగునో" అని రాజుతోఁ బలికెను. పలుకుటయే తడవుగా నాతఁడు పదునాఱు గురు పాత్రులకు వేర్వేఱ లేఖలు వ్రాసి, గూఢముగ సేవకులతో వారికిఁ బంపెను. ఆ సేవకులను గజపతిగూఢచారులు పట్టుకొనిపోయి, రాజుముందర నిలిపిరి. అతఁడు వారియొద్దనున్న లేఖలు విప్పి చదివించెను. వానియందలి పద్ధతి యిది: "శ్రీ. శ్రీ. శ్రీ. కృష్ణదేవరాయలవారు మీ పద్ధతికి సమ్మతించిరి. మీరు చెప్పినట్లు రేపు గజపతిని మాకుఁబట్టి యిత్తురేని, మీ రడిగిన దానికంటె మిక్కిలిగా, గ్రామములు, రత్నాభరణములు, మీ యధీనముచేయఁబడును. ప్రకృతమున కివి మీకు బహుమానములు" అని యుండెను. లేఖల వెంటఁగొన్ని వస్త్రాభరణములును వారికడ నుండెను. వానిఁ జూడఁగనే గజపతికిఁ దనసామంతులు శత్రువులకు లొంగినట్లు విస్పష్టమయ్యెను. 'ఇఁక నేను శత్రువులచేతఁ బడుదు'నని భీతిల్లి, యెవరికిని దెలియకుండ నాతఁడు నగరు విడిచి, దూరదేశమునకు రహస్యమార్గ

మునఁ బాఱిపోయెను. మఱునాఁడు యుద్ధరంగమున గజపతి కానరానందునఁ బాత్రులు రణము చాలించి, విచారించుచుండిరి. ఆ సమయమునఁ దిమ్మరుసు గజపతి దాఁగుకొన్న స్థలము నెమకికొనిపోయి, యాతనితో సమయోచితముగ మాట్లాడి యతని కూఁతురగు తుక్కాంబను రాయల కిచ్చునట్లును, సంతతో నిరుపక్షముల వారును యుద్ధము విరమించునట్లును నేర్పాట్లు చేసికొని వచ్చెను. అట్లే గజపతి తన కూఁతును రాయలకిచ్చి పెండ్లి చేసెను. ఈ సందర్భమున మరియొక యైతిహ్యము కలదు. తుక్కాంబ రాయలను మనసార వరియించి నప్పటికిని, దల్లియొక్క ప్రేరేపణమునఁ బడుకటింటిలో రాయలు నిద్రాసక్తుఁడయి యున్నతఱి వధియింప నుండఁగా, దానిని దిమ్మరుసు ముందే గ్రహించి, యామె యుద్యమమునకు విఘాతము కలిగించె ననియు, దాన, రాయల కామెపై విరోధభావము కలుగఁగా, యాథార్థ్యమును వెల్లడించి, యన్నపూర్ణ యాత్మ నైర్మల్యము నుగ్గడించి, వారిరువుర ప్రేమాంకురములకుఁ గలిగిన విఘాతములఁ బాఱఁదోలి, సౌహార్దము చేసెననియుఁ బహువుర వాడుకలో నున్నది. రాయలు తుక్కాంబను వివాహమై యుండుటలకుఁ బ్రతిఫలముగ రాజమహేంద్రమువఱకుఁ గల దేశమును గజపతి కొసంగి, క్రీ. శ. 1516-వ వత్సరమునఁ బూర్వ దిగ్విజయయాత్రను ముగించి, స్వస్థానముఁ జేరెను. తిమ్మరుసు యుక్తితోనే రాయలు పాయదగనుండి

రక్షింపఁబడెను. మున్ముందు రెండు రాజ్యములకుఁ బోరాటములు లేకుండ, బాంధవ్యము సంభవించెను. రాజధానిని జేరిన కొంతకాలమునకే రాయలు తిమ్మరుసు నాజ్ఞతో నాదిల్‌షాహాను బరాజితునిఁజేసి, మున్ను తండ్రి కొన్న రాచూరు ముదిగల్లు దుర్గములను మరల రాఁబట్టు కొనెను.

తిమ్మరుసు విజయనగరమునఁ బెక్కు సంవత్సరములు వసించి, కృష్ణదేవరాయని ప్రాపునఁ, జిట్టిగంగ నామాత్యుని యుపదేశములను బొల్లుపోకుండ నెఱవేర్చెను. ఇతని కాలమున నాంధ్రసామ్రాజ్యము కటకమునుండి కన్యాకుమారి వఱకు వ్యాపించెను. సంస్కృతాంధ్ర కర్ణాటభాష లభివృద్ధిగాంచఁ గల్గెను. ప్రజలకు నీటి వసతులు, వ్యవసాయ సౌకర్యములు విరివిగఁజేయఁ బడెను. విజయనగరము విస్తీర్ణమునందును, వైభవమునందును నమరావతిఁ దలఁదన్నినిక్కెను. శైవవైష్ణవ జైనాది సర్వమతములు పోషింపఁబడినవి. విదేశములతో వ్యాపారములు విరివిగ సాగింపఁబడియెను. వేయేల? విజయనగర సామ్రాజ్య ప్రతిష్ఠకును, కృష్ణదేవరాయల కీర్తి వ్యాప్తికిని, తిమ్మరుసే ముఖ్యహేతువనను, నా రెంటికి నాతఁడే మొదుగడయు నన్నఁ జాలును. భారతీయ మహామంత్రు లెందఱో కలరు. అందఱిలోను నింత సంపూర్ణ బాధ్యతను వహించినవారు మాత్రము లేరని చెప్పవచ్చును.

ఇట్టి మహాగుణఖని - శ్రీకృష్ణరాయనిఁ బుట్టుక నుండి సాకి, సంతరించి, ప్రాణాపాయములనుండి తప్పించి యింతటి వానిగాఁ జేసిన తిమ్మరుసు—కృష్ణరాయని పుత్త్రుని జంపించెననియు నంతటి వివేకనిధి - తండ్రికన్నఁ బూజ్య భావమున నారాధించిన పరమభక్తుఁడు నగు శ్రీకృష్ణరాయలు తిమ్మరుసు కన్నులు పీఁకించెననియు, నెట్లు ప్రథ పుట్టినదో కాని. వారిరువురి జీవితములను బరిశీలించిన వారి కందేదియు నమ్మఁదగినది కాదని వేఱుగఁ జెప్పఁబనిలేదు.

తిమ్మరుసు మహామంత్రివరా! నీ వాంధ్ర సామ్రాజ్యమునకుఁ జేసిన సేవవలని ఋణము నెన్నిజన్మములకైన నెట్లీఁగఁ గలము!